# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన **మాదీఫలముల** రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

**3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై**

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

**3 ఔ॥ రు. 3-10 6 ఔ॥ రు. 5-50**

## క్షీరబలాతైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయ వ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

**6 ఔ॥ల బుడ్డి రు. 3-0**

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

**బుడ్డి రు. 2-0**

## ప్రమేహాంతకం

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

**బుడ్డి రు. 4-0**

# కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

**15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.**

ఆంధ్ర ప్రదేశ్, మైసూరులకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు, బెంగుళూరు

# వేదకాలం నాటి నుండి...



"तंतुं तन्वन्, रजसो भानुमन्विहि,
ज्योतिष्मतः
पथो रक्ष धिया कृतान् ॥
अनुल्बणं वयत,
जोगुवामपो, मनुर्भव, . . ."

ऋग्वेद



మిలమిల మెరసే, కన్నుల విరిసే
రంగుల నెంచే, అనుకరించి మించే
వడకిన నూలు - జాతికి వేలు -
సున్నితమైనవి, సుందరమైనవి
నేయండెన్నో సూత్రాలు ...
కవిపుంగవులై, కళాస్రష్టలై
తాతలు చూపిన దారిని చూచి
అనుగమించి సృష్టించండి ...

(ఋగ్వేదం ఆధారంగా)




మగ్గం కదలితే
మనోహర సృష్టి

## చేనేత వస్త్రాలు

ఆల్ ఇండియా హాండ్‌లూమ్ బోర్డు
షాహీబాగ్ భవనం, విటెట్ రోడ్, బొంబాయి

DA-58/414

అపారమైన శక్తియుత్సాహముల
మీ ప్రతిష్ఠను కాపాడగలవు

# అమృత

మధురమైన పానీయము

వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆబాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి రుచ్యంగావుండి పోషించి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మహౌషధులచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికీ ఆప్తబంధువు లాటిది.



## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్ కు, తమిళనాడుకు ఏజంట్లు :

సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.

---

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౩౧] మార్చి 1959 [సంచిక 3

# వి ష య సూ చి క




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణి!



# శుభ సూచనలు



డాక్టరు కే. యన్. కేసరిగారు రెండు లక్షల విరాళమిచ్చి కేసరి విద్యాలయముల నిర్వహణ కవకాశము కల్పించారంటే మద్రాసులోని తెలుగు బాలబాలికలకు మాతృభాషలోని విద్యావసతులు శాశ్వతముగా నమరినవని చెప్పాలి. అయితే ఆ విద్యాలయములను వృద్ధిచేసికొని తమ స్వీయావసరాలకు వినియోగించుకోవలసిన బాధ్యత మద్రాసులోని తెలుగువారిది.

మద్రాసు ఉమ్మడి రాష్ట్రంగా నున్నప్పుడు సయితము కేసరి విద్యాలయముల లాంటి సంస్థల అవసరము యుండింది. ఆంధ్రరాష్ట్రం విడిపోయిన తరువాత ఆ యవసరము మరింతగా ఏర్పడింది.

డాక్టరు కేసరిగారి విరాళము, విద్యాలయముల అభివృద్ధిపట్ల కృషి, ఆసక్తితో పాటు మద్రాసులోని తెలుగు ప్రముఖుల సహాయ సహకారములతో విద్యాసంస్థలు

అభివృద్ధిదశలోనుండుట సంతోషింపతగిన విషయము. త్యాగరాయనగరునందలి విద్యాలయముల భవనముల విస్తరణకేమి, వసతుల పెంపునకేమి, నిర్వహణకేమి భూరి విరాళములిచ్చి తోడ్పడిన దాతలు యీ సందర్భమున అభినందనీయులు. వారి ఔదార్యము, వదాన్యత అనేకులను ప్రోత్సహించి కేసరి విద్యా సంస్థలు ఉత్తమోత్తమంగా యూ పొందగలవని ఆశిస్తున్నాము.

కేసరి ఎడ్యుకేషన్ సొసైటీ కార్యదర్శి దివాన్ బహదూరు బండి శ్రీ హరిరావు నాయుడుగారు కేసరి విద్యాలయముల అభివృద్ధి నుద్దేశించి చేయుచున్న నిర్విరామకృషి ప్రశంసనీయము.



# ఆత్మసంక్షోభము

కానాధిభట్ల వెంకటసుబ్బారావు

—(౦)—

"అల్లు దల్లాదంటే ఒళ్లు నిండేనూ
అల్లుడు గారినిచూస్తె ఒళ్లుమండేనూ."

అవును మరి! ఎంత నా అల్లుడయితేమాత్రం కోరికల కొండెక్కి కూర్చుంటే ఒళ్లుమండిపోదూ—! పెద్దమ్మాయి పెళ్ళిచేసి పట్టుమని పదినెల్లయినా నిండలేదు. అప్పుడే అప్పుల రంగయ్యవచ్చి పడనేపడ్డాడు పెద్దదాని పెళ్లికే ఇలా నానా గడ్డికరిచానే ఇంకా ఐదుగు రాడపిల్లలు! నా సామి రంగా — వాళ్లందరి పెళ్లిళ్లు అయ్యేసరికి సరాసరి స్వర్గానికి ప్రయాణం చేసేట్లున్నాను. మోసేవాడికి తెలుస్తుందయ్యా గాడిద బరువూ! మీకే గనక అరడజనుమంది ఆడపిల్లలు, ఇంకా దేవుడు మేలుచేస్తే, డజనుమంది పుట్టివుండినట్లయితే మీకూ తెలిసివుండేది అమ్మాయిల భారం! మా వియ్యంకుడున్నాడు ఆయన్ను వియ్యంకుడనే దానికంటే యముడంటె బావుంటుంది. మూడు వేల మూడు వందలూ కొట్టేయ్యటమే కాకుండా నా పిల్లకు దమ్మిడీ కాసంత సొమ్మైనా పెట్టలేదు. డబ్బుమాత్రం పోసుకున్నాడు అబ్బరంగా. డబ్బును నూరుకుని తాగే మనిషి!

ఇక మా అల్లుడు వున్నాడు. 'మింగటానికి మెతుకులేదు, మీసాలకు సంపెంగనూనె' అన్నట్లు. టిప్‌టాప్‌గా సూటుమీద సూటు కావాలంటాడు. ఇంతెందుకూ! మొన్నను శోభనంనాడు వందరూపాయలు ఇస్తేనేకాని గదిలోకి కదలండే—! అబ్బ చెప్పి పంపించాడు. ఈ భద్రభాజిమానం వప్పజెప్పేశాడు. అల్లుడిదేంపోయిందీ; చచ్చేవాడిని నేనేగా—! ప్లీడరు గుమాస్తా ఇప్పిస్తానోయ్ అంటే ఊహూ! అన్నాడు. పెద్ద ఈయన హోదాకు భంగమైనట్లు—మండిపోయిన హోదా వీడునూ. కలక్టరంత పొజీషన్‌లోవున్న జాబ్ కావాలిట కట్టకట్టుకుని కార్లలో వూరేగాలట. చూస్తే బిల్ కలెక్టర్‌కు పనికిపడేటంత క్వాలిఫికేషనైనా లేదు.

M. A. B. P. అంటే అదేదో పెద్ద క్వాలిఫ్‌కేషన్ అని మురిసిపోయి మనమ్మాయికి అంత డిగ్రీహోల్డర్ భర్త కావటం అదృష్టం అని మా ఆవిడ దగ్గర కేతకేత సొరకాయలు కోశాను. నమ్మేసిందంతానూ. తీరా మ్యారేజి అయింతర్వాత తెలిసింది, ఆ డిగ్రీకర్థం; మెట్రిక్‌కు కూర్చొని తప్పాడు అని. అంతా అయిపోయింతర్వాత పెళ్లిళ్ల పేరయ్య మోసంచేశాడని ఎంత ఏడిస్తేనేం—!

మొన్న దసరాకు పిలిచాను. నమ్మండి! నమ్మకపోండి! నానా గడ్డీ కరిపించాడు. మా ఆవిడ పోరు భరించలేక ఛస్తూ సంక్రాంతికూడా పిలిచాను. చెంపలు వాయించుకున్నాను. పచ్చిగడ్డి తినిపించాడు. ఈగాడికికూడా పిలవమని దాని సొదా! నా సొద వానికేం పట్టినట్లులేదు. ఈ సారి రేడియో ఇస్తేనేకాని గుమ్మం కదలనంటాడు. అల్లుడుగారికి నన్నడగటం నామర్దాకాదుమరి! ఇంత డిగ్రీహోల్డరుకూ—! అమ్మాయిచేత అడిగిస్తాడు; దానికేం తెలుసూ వెర్రిమొహం! మొగుడు చెప్పిందంతా వప్పచెప్పేస్తుందీ—! ఆ లెటర్ తాలూకూ సమ్మరీకి అదిరిచచ్చేవాడిని నేనేగా—! ఏమో బాబూ కొంపలో గోల భరించలేక అల్లుడిని రమ్మనమని వ్రాశాను. అవతల అప్పుల రంగయ్య వచ్చాడు యుద్ధానికి. వస్తా—!

—(౦)—

# డాక్టర్ కే. యన్. కేసరిగారి వదాన్యత ప్రశంస



మద్రాసు, ఉత్తరప్రదేష్ గవర్నర్లు శ్రీ బిష్ణురాంమేధి శ్రీ వి. వి. గిరిగారలు కేసరి విద్యాలయముల వార్షికోత్సవ సందర్భమున ఫిబ్రవరి 21·వ తేది శ్రీ కేసరి గారు విద్యా వ్యాప్తిగాను యిచ్చిన విరాళములను, ఆసక్తిని ప్రశంసించిరి.

త్యాగరాయనగరు కేసరిహైస్కూలు ఆవరణలో మద్రాసు గవర్నర్ బిష్ణురాం మేధిగారి అధ్యక్షతన జరిగిన వార్షికోత్సవ సమావేశమునకు చక్కని ఏర్పాటులతోటి ఆనందోత్సాహముల మధ్య జరిగెను. గవర్నర్ సతీమణి శ్రీమతి మేధి బాల బాలికలకు బహుమతులు పంచిపెట్టిరి. శ్రీ వి. వి. గిరిగారు ఉపన్యసించిరి.

కేసరి ఎడ్యుకేషన్ సొసైటీ అధ్యక్షులు డాక్టర్ టి. యం. బి. నెడుంగాడిగారు స్వాగతము చెప్పుచు కేసరి విద్యాలయముల అభివృద్ధికి తోడ్పడుచు సొసైటీ కార్యకలాపములకు చేతోడు వాతోడుగా నున్న దాతలకు కృతజ్ఞతను తెలిపి అధ్యక్షత వహింపనున్న మద్రాసు గవర్నర్‌కు, శ్రీ వి. వి. గిరిగారికి, పుర ప్రముఖులకు స్వాగతమిచ్చిరి.

మద్రాసు గవర్నర్ శ్రీ మేధిగారు ఉపన్యసించుచు డాక్టరు కేసరిగారి వదాన్యత ప్రశంసించ తగినదనియు, ఆయన యిచ్చిన భూరివిరాళములకే కాక సంస్థల యభివృద్ధిపట్ల చూపిన అత్యంత శ్రద్ధా సక్తులకు కలకాలము కృతజ్ఞతతో స్మరణీయులు అనిరి.

విద్యా సంస్థలకు దాతలు తోడ్పడుట ప్రశంసనీయము. ఇట్టి వదాన్యత చాల ఉత్తమమైనది. మన మంతరము కేసరి గారిని ముక్తకంఠముతో కీర్తించవలసి యున్నది.

కేసరి విద్యాలయముల అభివృద్ధికి భూరి విరాళమిచ్చి తోడ్పడిన దాతలకు ధన్యవాదములు తెలుపుచు యిట్టి ప్రజాహిత సంస్థలకు దాతల సహాయ సహకారములతో ఉజ్వలమైన భవిష్యత్తుకలదనిరి. మద్రాసు పౌరులు యీ సంస్థల నిర్వహణకు తోడ్పడుటయేకాక, దానికి భవన వసతిని, యితర అవసరాలను సమకూర్చినందులకు చాల సంతోషమును వెలిబుచ్చిరి. ఫిలిం పరిశ్రమలోని అనేక ప్రముఖులు తోడ్పడారు. మరికొందరు ఉచిత విద్యావేతనములకు వసతులు వెనుకబడిన జాతుల వారికి కల్పించారు. గవర్నర్ గారు యింకా ఎయిడెడ్ సంస్థలు విద్యావ్యాప్తికి, విద్యాభ్యుదయానికి ప్రముఖపాత్ర నిర్వహించవలసి యున్నదనియు, విద్యావ్యాప్తికి ప్రభుత్వమునకు అది అత్యావసరమనియు చెప్పి అందుకుగాను ప్రభుత్వ అవ

సరము, విద్యార్థి వేతనము వసూలును గురించి ప్రభుత్వము పరిశీలించుచున్నదనియు ఈ విషయమును ప్రభుత్వము శాసనసభా విద్యా సంఘమునకు తుది నిర్ణయమునకై పంప నిశ్చయించినదనిరి.

విద్యావ్యాప్తి ప్రయత్నములో అనధికారకృషి నెప్పుడు ప్రభుత్వము ఆటంకపరచదనియు, సహాకారము నపేక్షించుచుండుననియు, వారి సాధక బాధకములను ప్రభుత్వమునకు నివేదించుకొనవచ్చుననియు అనిరి.

తెలుగు ప్రజానీకము తమ బాలికలకు మాతృభాషలో విద్యావసతికై మద్రాసులో ఉత్తమమైన కృషి చేశారు. అయితే విద్యార్థులు ప్రాంతీయభాషయైన తమిళమును సయితము నేర్చుకొనుట మంచిది. మరేభాషను నేర్పినా నేర్చుకొనుట వాంఛనీయమే. తమిళము నేర్చుకొనుటవలన అరవసోదరులతో సన్నిహితముగా కలిసిమెలసి యుండుటకు, పరస్పర సద్భావ సౌభ్రాత్రములు పెంపొందుటకు అవకాశములు విస్తృతము కాగలవు. ఇట్టి సమరస సమైక్యతలు జాతీయ శ్రేయస్సుకు అత్యంత అవసరము. అందరు బాలలకు అన్యభాషను అభ్యసించుట సులభము కాకపోవచ్చును కాని నేర్చుకున్న వారికి మాత్రము భవిష్యత్తులో ఉపయుక్తము కాగలదు.

మధ్యాహ్న భోజన వసతికిగాను హాలు నిర్మాణమునకు శ్రీ బి. నాగిరెడ్డి గారు సమ్మతించినందులకు సంతోషమును వెలిబుచ్చి బీదబాలికల ప్రాథమిక విద్యావ్యాప్తికి మధ్యాహ్న భోజన ప్రణాళిక ముఖ్యమైనదనియు, ఈ ప్రణాళిక అమలుపరచి మద్రాసు రాష్ట్రము యితర రాష్ట్రములకు ఆదర్శనీయమైనదని శ్రీ గవర్నర్ గారనిరి.

ఉత్తర ప్రదేశ్ గవర్నర్ శ్రీ వి. వి. గిరిగారు తమకు ఆంధ్ర, ఒరిస్సా, కర్ణాటక ప్రాంతాలతో సంబంధమున్నా మద్రాసుపై అభిమానము మెండు అన్నారు.

డాక్టర్ కేసరిగారిని ప్రశంసిస్తూ వారి యనంతరము సయితము వారి కుటుంబము కేసరిగారు స్థాపించిన సంస్థల అభివృద్ధిపట్ల ఆసక్తి చూపుచున్నందులకు కృతజ్ఞత వెల్లడించవలసియున్నది. భూరివిరాళములిచ్చి యీ విద్యావ్యాప్తి నుద్దేశించి యీ సంస్థలకు మద్రాసువారు తోడ్పడుచుండుట సంతోషింప తగిన విషయము. కేసరి ఎడ్యుకేషన్ సొసైటీ కార్యదర్శి శ్రీ బి. వి శ్రీహరిరావునాయుడు యీ విద్యాలయముల అభివృద్ధికిగాను చేయుచున్న కృషి అపారము. వీరి నిర్విరామ కృషిఫలితముగా కేసరి విద్యాసంస్థ దినదినాభివృద్ధి గాంచి కాలేజి రూపొందగలదని ఆశిస్తున్నా

నని శ్రీ వి. వి. గిరిగారు ఉపన్యాసమును ముగించిరి.

దివాన్‌బహద్దూరు బండి శ్రీహరిరావు నాయుడుగారు వార్షికని వేదికలో శ్రీ బి. నాగిరెడ్డి, శ్రీ యార్లగడ్డరామనాథబాబు శ్రీమతి అంజలిదేవి, శ్రీ వై. వెంకన్న చౌదరి, పీసస్ స్టూడియోస్ అధినేత. గానన్ డంకర్లీ & కో.. శ్రీయస్. వి. అప్పారావు, కేసరి హైస్కూలు పూర్వవిద్యార్థి సంఘము, శ్రీరంగసాయకులు, శ్రీయస్. వైద్యనాథన్‌గారల భూరి విరాళములను వివరించిరి.

మొత్తము 1187 మంది బాలబాలికలు కేసరి విద్యాలయములలో నున్నారనియు, విజయా, వాహినిస్టూడియోల అధినేత శ్రీ బి. నాగిరెడ్డిగారు విద్యా సంస్థల నిర్వాహకులు కాలేజిని రూపొందించనున్నచో తాము మరొక రు 25000-/ను విరాళమిచ్చెదమని వాగ్దానము చేసిరనియు, కాని ప్రత్యేకము తెలుగు బాలలకు కాలేజి ఏర్పడుట యిప్పట్లో సాధ్యము కాకపోవచ్చునియు, పరిపాలకవర్గము ఉదారులకు ముందుముందు విరాళము లివ్వవలసినదిగా విజ్ఞప్తిచేయుచున్నాననిరి.

ఈ మధ్య ప్రభుత్వగ్రాంటులు, విద్యార్థి వేతనములనుగురించిన ప్రభుత్వ ఆర్డరు నూతనసమస్యలకు కారణమయినది కమిటీ ప్రభుత్వమునకు త్యాగరాయనగరు కేసరి ప్రాథమిక పాఠశాలను అల్పసంఖ్యాక భాషా వర్గపు సంస్థగా ప్రత్యేకంగా పరిగణించునట్లుగాకోరినది. ప్రభుత్వము సూచించిన మార్గాలలో నొకదానిని ఎన్నుకొనుటకు 1959 - 60 సం॥ దాకా వ్యవధి కోరబడినదని చెప్పిరి.

శ్రీ శ్రీహరిరావునాయుడుగారు కేసరి విద్యాలయముల వ్యవస్థాపకులగు శ్రీ కేసరిగారికి జోహారులర్పిస్తూ శ్రీ నాగిరెడ్డిగారు మధ్యాహ్నభోజనశాలను కేసరి ఎలిమెంటరీ స్కూలు వినియోగార్థం నిర్మింపజేయ సమ్మతించినందుకు కృతజ్ఞతను వెలిబుచ్చిరి. ఉదారులు వారి దృక్పథాన్ని అనుసరించగలరని ఆశిస్తూ ముఖ్యంగా శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్యనాయుడు, శ్రీగోగినేని చిన వెంకటేశ్వరరావు నాయుడుగారలు కేసరి హైస్కూలు (త్యాగరాయనగరు) నివాసవసతుల అభివృద్ధికి తోడ్పడవలెననియు, శ్రీ వెలగపూడి రామకృష్ణ I. C. S. (రిటైర్డు) మన పాఠశాలల అభివృద్ధి అభ్యుదయములకు తోడ్పడవలసినదిగాను విజ్ఞప్తి చేసిరి.

మైలాపూర్ కేసరి హైస్కూల్ A. C. C. బాలబాలికలు గవర్నర్లకు సైనిక వందనం సమర్పించిరి. బాలబాలికల సంగీత, నృత్య వినోదప్రదర్శనలతోను, త్యాగరాయనగరు కేసరి హైస్కూలు ప్రధానోపాధ్యాయిని శ్రీమతి టి. వసంతలక్ష్మి వందనసమర్పణముతోను సమావేశము ముగిసెను.

—X—

# ఎర్రయ

శ్రీ నేతి శ్రీరామచంద్రమూర్తి

"స్ఫురదరుణాంశు రాగరుచి బొంపిరివోయి నిరస్త నీరదా
వరణములై దళత్కమల వైభవ జృంభ ణ ముల్లసిల్లమ
ద్ధురత రహంస సారస మధువ్రత నిస్వన ముల్ చెలంగగా
గరము వెలింగె వాసర ముఖంబులు శార దవేళ జూడగన్!"

ఈ పద్యముతో ఎర్రయ భారత రచన నుపక్రమించినాడు. కవిత్రయములో చివరివాడగు ఎర్రయ, నన్నయ్య చూపిన త్రోవనే భారతమును రచించినాడు!

ఎఱ్ఱాప్రగడ శ్రీవత్సగోత్రుడు. సూరనార్యునకు, పోతమాంబకు పుట్టినవాడు. శివభక్తుడు. ఈతని సహచారిణి మహాలక్ష్మి.

ఎర్రన భారత గ్రంథమున అరణ్యపర్వశేషమును పూరించెను. దీనిని రాధామాధవకవి సొగసుగ—

"భారతకావ్యహార మొక భాగము నన్నయ భట్టు గూర్చె ము
క్తారమణీయ వాక్యముల దక్కిన భాగము సోమయాజి సాం
పారగ నొనర్చె రెంటిగలయన్ శివదాసుడు మధ్య నాయక
శ్రీ రచియించె శారద ధరింప కవిత్రయ కీర్తి మించగన్"

అని పలికినాడు.

ఎర్రన ఇతరకృతులు హరివంశము, నృసింహ పురాణము, రామాయణము. కానిఏకారణముననో రామాయణమిప్పుడు లభించుటలేదు. ఎర్రన వేమారెడ్డి కాలమువాడు। అనగా 14 వ శతాబ్దమధ్య భాగమువాడు.

ఎర్రయ హరివంశమును అద్దంకి రాజధానిగ జేసికొని ఆంధ్రదేశమును పాలించిన ప్రోలయ వేమారెడ్డి కంకితమొనర్చెను.

ఎర్రన మొట్టమొదట మహాభారత అరణ్య పర్వశేషమును పూరించి పిమ్మట నృసింహపురాణము చెప్పియుండవచ్చును.

నన్నయ రచనలో కథా విధానమెక్కువ. తిక్కన రచనలో శిల్పతత్వ మెక్కువ. అందు ఎక్కువగా 'రసస్పృష్టి' కానిపించును. ఎర్రయ వీరి రచనావిధానములలో మేలేర్చికొని కావ్యరచనకు పూనుకొనెను. "సూక్తివైచిత్రి" ఎర్రయ యందొక ప్రత్యేకగుణము. ఈవిషయమును గూర్చి శ్రీనాథ మహాకవి -

"పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని దేవ
సూక్తి వైచిత్రి నొక్కొక్క మాటు ..."

అని చెప్పియున్నాడు.

ఎర్రనకు 'శంభుదాసుడు'; 'ప్రబంధ పరమేశ్వరుడు' అని రెండు బిరుదములుగలవు.

రామాయణమును ప్రేరణ మొనర్చినవాడు మల్లారెడ్డి. ఈతడు వేమారెడ్డి తమ్ముడు. ఈ రామాయణమును గురించి హరివంశ కృతిపతి నిటుల పలికెను.

"నా తమ్ముండు ఘనుండు మల్లరథినీ నాథుండు నిస్నాతత
శ్రీ తోడన్ సము పేతు జేసి యెలమిం జేపట్టి మా కిచ్చుటన్
జేతోమోద మొలర్ప రామకథమున్ జెప్పించి యత్యుత్తమ

ఖ్యాతింబొందితి నింక సుందరనియనే గావ్యామృ
తా స్వాదనన్.”

ఎఱ్ఱయ హరివంశము కృష్ణభగవానుని జీవిత చరిత్ర.

ఇందు కృష్ణుడు లీలామానుష విగ్రహుడు, ప్రపంచాతీతుడు, లోకోద్ధారకుడు, రాజకీయవేత్త.

హరివంశ కృతిపతియగు వేమారెడ్డికి పుత్రులు లేనందున ఎఱ్ఱయచే హరివంశము ఆంధ్రీకరింపచేసి సంకితము పుచ్చుకొనెననియు కొందరు విద్వాంసు లూహించుచున్నారు!

ఎఱ్ఱయకు మహాదేవకవి, వెన్నెలకంటి సూరనార్యుడు (విష్ణుపురాణకర్త) సమకాలికులు.

సత్వగుణ ప్రధానముగ రచన చెప్పిన ఎఱ్ఱయ మొదటివాడు! ఇట్టి మహనీయునికన్న తల్లితండ్రులు ధన్యులు.

——(o)——

# పుట్టకురుపు నిదానానికి కొత్త పద్ధతి

సోవియట్ వైద్య విజ్ఞాన శాస్త్ర వేత్త ప్రొఫెసర్ మాక్సింమెయ్‌సెల్ విష గ్రంధుల నిదానానికి ఒక కొత్తపద్ధతిని కనిపెట్టారు. మానవ శరీరంలోని ధాతువులు, కణాలు మొదలైనవాటికి కొన్ని పూతలను వేసి, అల్ట్రావైలెట్ కిరణాలను ప్రసరింపజేసినట్లయితే అవి వివిధ వర్ణాలతోకూడిన తేజాన్ని వెదజల్లుతాయని ఆయన కనిపెట్టారు.

ఈ పద్ధతి ననుసరించి విషగ్రంధులను పరిశీలించి చూడగా కొన్ని నూతన విషయాలు బయటపడ్డాయి. ఇలా సూక్ష్మదర్శిని యంత్రంద్వారా చూడగా విషగ్రంధులు ఇతర భాగాలనుండి విభిన్నంగా అగుపడ్డాయి.

ఈవిధంగా పుట్టకురుపును కనిపెట్టడానికి మంచి అవకాశాలు యేర్పడుతున్నాయని విజ్ఞానశాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు. ఏదైనా గ్రంధి విషసంబంధమైనదా లేక ప్రమాదరహితమైనదా అన్న విషయాన్ని ఈ కొత్తపద్ధతిద్వారా కొద్ది నిముషాల్లో కనిపెట్టవచ్చును.

అంతేగాక పుట్టకురుపు ఉన్నట్లుయితే ఆ విషయాన్ని ఈ నూతనపద్ధతి ద్వారా ప్రారంభదశలోనే కనిపెట్టివేయవచ్చును. ఎందువల్లనంటే ఆరోగ్యవంతంగా ఉన్న శరీర భాగాలు వెదజల్లే కాంతికీ, పుట్టకురుపు ఉన్నభాగం వెదజల్లే వెలుగుకూ చాలా తేడా ఉంటుంది.

ఈ నూతన పద్ధతిని విస్తృతంగా ఆచరణలో పెట్టడానికి ఇప్పుడు ప్రయత్నాలు జరుగుతున్నాయి.







ఇలాగ ఏదో ఒక అవసరానికిగాను—ప్రభుత్వం ప్రవేశపెట్టిన

## కొత్త
## గడువు డిపాజిటు పొదుపు పథకం లో

ప్రతి నెలా మీ పొదుపు ధనాన్ని మదుపు పెట్టండి.

| | | |
|---|---|---|
| నెలసరి డిపాజిట్లు | ▶ | ప్రతి నెలా రు 5 నుండి రు 200 వరకు |
| నెలసరి రు 10 ల డిపాజిట్లపై లభించేది | ▶ | అయిదేళ్ల తర్వాత రు 650, పదేళ్ల తర్వాత రు 1,450 లు లభిస్తాయి. |
| డిపాజిటు పరిమితి | ▶ | ఒక్కరు రు 12,000 లు, ఇద్దరు వ్యక్తులు కలసి అయితే రు 24,000ల వరకు డిపాజిటు చేయవచ్చును. |

పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు వారు గాని

## జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ

వారు గాని ఈ పెట్టుబడుల విషయమై పూర్తి వివరాలు మీకు సంతోషంతో అందజేస్తారు.

SA 58/364

# కన్నీటి తొలకరి

శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు B. A.,

వీరకుంకుమ దిద్ది — కర్పూరనీరాంజనం యిచ్చి "విజయ విలాసంతో విచ్చేయండి!" అంటూ మునిముని నవ్వులతో సుశీలాదేవి తన భర్త ప్రతాపసింహుని సాగనంపుతూంది కదనరంగానికి. బోసినవ్వులతో పాల బుగ్గలు కిక్కిరిసిపోతున్నాయి పసిపాప బాల చంద్రుడికి. పట్టపగ్గాలు లేని బాహుబలసంపన్నుడు ప్రతాపసింహుడు కాలుకదిపాడు - విద్రోహవిధ్వంసకి - విశ్వమానవ కళ్యాణానికి.

ఆ రోజుల్లో ఠగ్గులు - పిండారీలవంటి దొంగల గుంపులు దేశాన్ని కలచి కలవరపెడుతున్నాయి. మానవతుల మానమూ - ధనవంతుల ధనమూ - అమాయకప్రజల సౌఖ్యమూ అమాయదారుల చేతుల్లో భస్మమై పోతున్నాయి. శాంతి - భద్రతా సంతల పాలయ్యాయి. వూరు దాటితే భయం! వూళ్లోనే భయం!! ఇంతెందుకు? ఇంట్లోనే భయం!!! తల్లి చూస్తూండగానే బిడ్డలహత్య. భర్త కళ్ళయెదుటే భార్యకు మానభంగం. పట్టపగలే నిలువు దోపిడీలు. ఇంకేం కావాలి? ఆనాటి ప్రజల అశాంతిమయ జీవితంలోని అగచాట్లు ఆ దేవుడికే తెలియాలి?

ఏ వీరుడైనా - కంకణంకట్టుకొని - యీ హింసామూర్తుల్ని చించి చెండాడి - వాళ్ళ మాంసఖండాల్ని కాకులకూ గ్రద్దలకూ తీయని తేనీటి విందుచేయడా? అని ప్రజలు వుట్టుడికి పోతున్నారు. ఎవళ్లకీ ధైర్యం చిక్కకుండావుంది. ప్రాణాలు ఎంతైనా తీపికదూ! ఎవరూ ముందంజవేయటంలేదు.

ఏమైనాకానీ! ప్రాణాల్ని దేశసేవకు బహుమానం చేస్తాను. నా నడిగడ్డలో నర్తన సాగిస్తూన్న యీ వినాశకారుల్ని అంతంచేయాలి. అధర్మజ్వాలని ఆరిపి తీరాలి — అని నిశ్చయించుకొన్నాడు ప్రతాపసింహుడు. పిఠికి నెత్తురులేని తదితర వూరు అంతా అతని నిశ్చయానికి అండగా నిలబడ్డారు దొంగల మూకాని క్రుంగదీయడానికి ముందంజవేశారు

కదనరంగానికి సపరివారంగా పోయేముందు ప్రతాపసింహుడు సుశీలాదేవి గడ్డాన్ని ఎడమచేతితో పట్టుకొని - కుడిచేతితో బాలచంద్రుడి పాలబుగ్గల్ని నిమురుతూ - యిలా అన్నాడు.

"సుశీలా-యిది సమరయాత్ర - చావు బ్రతుకుల ఉయ్యాల. వస్తే విజయశ్రీతో, చస్తే వీరస్వర్గంతో. ఏదైనా సంతోషమే. ఏది యెలా సంఘటించినా అధైర్యపడకు. భావిపౌరుడు - మన బాలవీరుడు-జాగ్రత్త" అంటూండగానే సుశీలాదేవి వీరకుంకుమ దిద్దింది. కర్పూర నీరాంజనం యిచ్చింది. ప్రతాపసింహుని సాగనంపింది.

దేశం అంటే మట్టికాదు. మట్టిమీదవున్న ప్రజలే దేశం. ప్రజలన్నా దేశమన్నా తేడాలేదు. పౌరుషం-త్యాగంతో వర్ధిల్లే ప్రజలే మట్టికి ప్రాణం పోస్తారు; జాతికిజవజీవాలు పోస్తారు. అవసరమయితే.జాతీయ సౌఖ్యంకోసం - స్వేచ్ఛకోసం — శాంతికోసం_తమ ప్రాణాల్ని బలిదానంచేస్తారు. జాతీయచరిత్రలో వారి త్యాగమయ గాథలు సువర్ణాక్షర లిఖితం - ఈ కోవకి చెందిన ఉత్తమ పురుషుడు ప్రతాపసింహుడు.

పతికి పౌరుషం ప్రేరేపిస్తారు — నిజమైన వీరపత్నులు. వీరవిహారంచేసి_భర్త ప్రపంచ ప్రఖ్యాతిని సముపార్జించాలని ఆకాంక్షిస్తారు ఆ అనుపమాన శౌశీల్యవంతులు — స్వార్థపరత్వం లవలేశమూలేని స్తవనీయ చరితలు! పిఠికిపందలాగ - భర్త తిరోగమనం సాగించడం సహించలేని మాన్యమహిళలు. ఈ లాంటి త్రోవని పోయే ఉత్తమోత్తమ ధర్మపత్ని_సుశీలాదేవి! ప్రతాపసింహునికి తగిన ఉజ్జీ!

సింహం కడుపున చింబోతు పుడుతుందా — చెప్పండి! అటువంటి జగజెట్టికి — ఇటువంటి వీర పత్నికి — పుట్టిన బాలచంద్రుడు మాత్రం తక్కువా?

ఇంటాబయటా — యిలాగ జేజేలు స్వీకరించి — పెద్దల చల్లని దీవనల్ని శిరసావహించి — దేశక్షేమం కోసం — ప్రతాపసింహుడు శత్రువుల్ని చించి చెండాడడానికి బయలుదేరాడు.

కంటికగుపించేవరకూ చూస్తూనేవుంది సుశీలాదేవి తన భర్తనీ ఆ వీరపరివారాన్నీ. ఇంక ప్రతాపసింహుడు కనపడటంలేదు. అతని అనుచరులూ కనపడటంలేదు. ఒకసారి — సుశీలాదేవి ముద్దుబిడ్డవైపు చూసింది. అలా చూస్తూంటే — బాలచంద్రుడు ఫక్కున నవ్వుతున్నాడు. ఆ ముఖంలోనే ప్రతాపసింహుని ప్రతిబింబం సుశీలతో దోబూచులాడుతూంది. సగర్వంగా ఇంట్లోకి పోయింది ఆయిల్లాలు. ఎదురుగా వుంది భర్త చిత్రం. ఆ ప్రక్కనేవుంది విజయలక్ష్మి విగ్రహం. సుశీల - మెడలోవున్న మంగళసూత్రాల్ని తీసి కళ్ళకద్దుకుంటూండగా కుడికన్ను ధణధణా అదిరింది. వెంటనే భర్త చిత్రానికి నమస్కరించింది. లక్ష్మి విగ్రహానికి అంజలించింది. పతిభక్తీ - దైవభక్తీ ఆవిడకి ఆభరణాలు.

రోజులు గడుస్తున్నాయి గబగబా, కాని అందరికీ అలావున్నా సుశీలాదేవికి చాలా భారంగా వున్నాయి. సూర్యోదయం అయితే - సూర్యాస్తమయం వరకు నిరీక్ష. సూర్యాస్తమయం అయితే సూర్యోదయంవరకూ నిరీక్ష. ఈ నిరీక్షణలో ఎలాటి వార్తలు చెవిలో పడతాయోననే బెంగ!

ప్రజలంతా చెప్పుకుంటున్నారు. ప్రతాపసింహుని సాహసాన్ని మెచ్చుకుంటూ. దొంగలు చాలామంది లొంగిపోయారని వార్తలు వినిపించేసరికి — హమ్మయ్య యిన్నాళ్లకి విన్నాం చల్లనికబురు అని ఆనందపరవశులవుతున్నారు ఆ పౌరులు.

ప్రతాపసింహుని బల పరాక్రమ వర్ణనలు - మాయదారి దొంగల మరణవార్తలు — శాంతిభద్రతలకు ఇంక ఎలాంటి భయములేదనే మాటలూ — తెగవినిపిస్తున్నాయి సుశీలాదేవికి. అంతా — ఎంత అదృష్టవంతురాలవమ్మా — అలాంటి వీరుని పెళ్ళాడిన సౌభాగ్యం నీదేనమ్మా — ఎంత పూజ చేశావోయీ పుణ్యపురుషుణ్ణి చేపట్టడానికి అంటూ అమ్మలక్కలు మెచ్చుకుంటూంటే తన అదృష్టాన్ని తలుచుకొని లోలోపల మురిసిపోతూంది సుశీల!

మరికొందరు బాలచంద్రుడి బుగ్గలు సాగదీస్తూ! అదుగో మీనాన్న — విజయభేరి మ్రోగిస్తూవస్తున్నారు. నీకెన్ని వూళ్లేలుతావో? అంటూంటే సుశీల పొందే ఆనందానికి హద్దూలేదు పద్దూలేదు.

మరి రెండు రోజులనుంచి యేవార్తలూ వినిపించటంలేదు. అప్పుడే తలుపు చప్పుడు. గుఱ్ఱపు డెక్కలచప్పుడుకూడా. ఎవరోవచ్చి పిలుస్తున్నారు. ఆదేమీ కొత్త కంఠంకాదు, ఏంవార్త వినాలో అని గుండెలు ఆతురతతో కొట్టుకుంటున్నయి. కాళ్ళు దడదడలాడుతున్నాయి ఎందుకో! ఆ పరిస్థితిలోనే సుశీలాదేవి తలుపుతీసింది. తలుపు తీసి చూసేసరికి ఎవరు? ఇంకెవరు —. అమరసేనుడు. ప్రతాపసింహునికి కుడిభుజం.

'అమరసేనా! అయ్యగారికి క్షేమంకదా'_అంది సుశీలాదేవి — తక్షణ సమాధానం అపేక్షిస్తూ. సందేహమా? తల్లీ — క్షామాన్ని మటుమాయంచేసిన జగజెట్టికి క్షేమలోపం వుంటుందటమ్మా! అన్నాడు హుందాగా అమరసేనుడు.

ఈ మంచి మాటల్ని విని — బాబూ అని పట్టరాని బ్రహ్మానందంతో సుశీలాదేవి ముద్దుబిడ్డ బాలచంద్రుణ్ణి గట్టిగా హత్తుకుంది. మంగళసూత్రాల్ని కళ్ళకద్దుకుంది. భర్త పటానికి అంజలించింది. లక్ష్మి విగ్రహానికి కైమోడ్పు లర్పించింది. ఇంకేం చెబుతాడోనని అమరసేనునివైపు చూచింది.

ప్రతాపసింహవీరుడు విజయభేరీలతో విచ్చేస్తున్నారమ్మా! తగిన విధంగా ఆ వీరవరేణ్యునికి సన్మానంచేసే బాధ్యత యీ పౌరులిది. ఈ సమా

చారం ముందుగా చెప్పాలని వచ్చామ్మా. సన్మాన సభాసన్నాహాలు — సమయోచిత కార్యక్రమాలు చాలా వున్నాయి. శెలవిస్తాను తల్లీ — శెలవు అంటూ నమస్కరించి అశ్వారూఢుడై అమరసేనుడు వెళ్లిపోయాడు.

సుశీలాదేవి చెవిలో అమరసేనుని అమృత వాక్యాలు — మధురరసాల మాటల మూటలు — అస్తమానం మరుపులేకుండా మారుమ్రోగుతున్నాయి మురుపులు కురిపిస్తూ. బెంగ ఎలా తుంగదీసి ఏనుగంత బారిని పీనుగగా చేస్తుందో సంతోషం సగంబలం తెచ్చి వాడిన తీగకు నవవసంతాన్ని తెచ్చిపెట్టదా మరి.

♦ ♦ ♦

ఇన్ని దేశాలనీ — ఇంతమంది ప్రజల్నీ హింసించి హింసించి అహింసాకాండలో ఆనందోపాసన సాగిస్తున్న చోరనాయకుడు వీరబాహుడు బలే జిత్తులమారి. ప్రతాపసింహుని తడాఖాకి తట్టుకోలేని తన పరివారమంతా ఎలా దాసోహం అని దణ్ణాలెట్టి దాసానుదాసులై బందీలయిన కథ అంతా తన కళ్ళముందే జరిగింది. అఘుళ్ళు అతనివి కావు. నోరెత్తితే తనకీ అనుచరులగతి కాక మరేంవుంది? ఓడిపోయినట్లు నటించి — ప్రతాపసింహుని కళ్ళు కప్పేసి — ఆ మోసకారి చోరనాయకుడు హఠాత్తుగా పలాయనం సాగించడం మొదలు పెట్టాడు. ఆ పిటికిపందని మృత్యు నీడలాగ వెన్నంటుతూ పోయాడు ప్రతాపసింహుడు. పత్తాలేకుండా పారిపోయాడు వీరబాహుడు. 'పరివార శూన్యుడైన వీరబాహుడూ — నీటిలోంచి బయటపడిన మొసలీ వొక్కటే అన్నారు' ప్రతాపసింహుని అనుచరులు.

దొంగల భూమ్యాంతరగృహం ప్రతాపసింహుని చేజిక్కింది. ఆ భవనాన్ని చూసి ప్రతాపసింహుడు ఆశ్చర్యపడ్డాడు. చేసేది దొంగతనం అయినా — ఆ దొంగలు అనుభవించేది యింత ఐశ్వర్యమా? ఇంత భోగమా? ఎవరికుంటుంది యింతదర్జా! అనుకున్నాడు. ఒక్కొక్క నగనిచూసి ఎంతో బాధపడ్డాడు ప్రతాపసింహుడు. ఈనగని ఎంత అవస్థపడి ఏ నిజాయితీపరుడు చేయించుకున్నాడో? దొంగల పాలయిన ఆనగను తలుచుకొని తలుచుకొని — 'ఏమయిందో నా కష్టార్జితం?' అని పరితపించిన మందభాగ్యుడెవరోగదా!' అని చాలా జాలిపడ్డాడు. ఈ నగలు ఎందర్ని వుసూరుమనిపించాయో! మరెందరి కొంపలు కూల్చాయో! ఇంకెందరి జీవాలు తీశాయో! ఆహా! ఒకరి విచారమే మరొకరికి సంతోషాన్ని కల్పించడం ప్రపంచంలో పరిపాటి! యిలా ఆలోచిస్తూ ఉద్రిక్తుడై పరివారానికి ప్రతాపసింహుడు యీ విధంగా అన్నాడు.

'ఇదంతా చోరధనం. సునాయాసంగా సంపాదించబడిన చోరధనం. ఎత్తండి దీనినంతా మన సంచులలోకి. కళ్ళులేని కబోధులకీ — కాళ్ళులేని కష్టజీవులకీ కుళ్ళికృశించిపోయే కుష్టురోగులకీ — ఆర్తనాదం చేసే అభాగ్యులకీ పంచుదాం. నిరతాన్నదానం బీదలకు చేసే అన్నసత్రాలను కట్టిద్దాం. ఎత్తండి దీనినంతా మనసంచులలోకి —' అని అంటూండగానే పరివారం అన్నంతపనీ ముగించారు.

'ఒక్కొక్క దొంగని తుంగదీసి — కాళ్లూ చేళ్ళూ విరిచికట్టి — కొరడాలతో వీపు చిట్లేటట్టు చావమోదండి. మానవులైనా పశుబలం ప్రయోగించి — సాటి సోదరప్రపంచాన్ని హింసించిన యీ నరరాక్షసులమీద జాలి చూపనక్కర్లేదు. ఎందరి ప్రాణాల్ని తీశారో యీ పరమనీచులు — వీళ్ళందరి ప్రాణాల్నీ ఒకేసమయంలో తీసినా పాపంలేదు. దుర్మార్గులికి హింసాఫలం యిలావుంటుందనే బుద్ధి వచ్చేటట్లు చేయండి —' అన్నాడు ప్రతాపసింహుడు. కొరడాదెబ్బలకు తట్టుకోలేని ఆ చోరపరివారమంతా — నీళ్లులేక ఎండకి ఎండిపోయిన మొక్కలాగ — నిరాహారంగా — నీరసంతో — బరువుగా — ప్రాణాలు వదలారు. ఎవరికీ జాలికలిగించని వారి దుర్మరణగాథని వేడుక చేసుకున్నారు అక్కడి వారు.

♦ ♦ ♦

విజయనినాదాలతో - వీరభేరి మోతలతో వీర ప్రతాపసింహుడు రాచఠీవితో గృహోన్ముఖుడయ్యాడు. పరివారం జోహారు చేస్తూంది. పురజనులు ఎదురు చూస్తున్నారు - యీ శాంతిదూతని ఆరాధించడానికి. ఎదురు సన్నాహాలతో మంగళ వాద్యాలు - మారు మోగుతున్నయి. పచ్చని తోరణ పంక్తులు కిలకిలలాడుతూ ఉయ్యాలలూగుతున్నాయి.

'ఆ కీచకుల మదమడచిన ఆ ప్రతాపసింహుడు యింకా ఎప్పుడువస్తాడే?' అనుకుంటూ అంతఃపురాలల్లోంచి మేలిముసుగులలో ఎదురుచూస్తున్నారు ఘోషా స్త్రీలు.

'వాడి కడుపు చల్లగా! ఆ దొంగల్ని సమూలంగా సర్వనాశనంచేసిన ఆ ప్రతాపసింహుడు పది కాలాలు వర్ధిల్లాలి' అన్నారు ముత్తైదువలు. 'అలాంటి భర్తని పెళ్ళాడిన సుశీలాదేవి ఏబంగారు పూలతో పూజచేసిందో కదా!' అంది ఒకామె. 'ఔనమ్మా- పూజకొద్దీ పురుషుడన్నారు. మా వారూ వున్నారు- దొడ్లో దొంగ వున్నాడండీ' అన్నా, 'వొద్దే-రాత్రిళ్ళు దొంగలమాట తలపెట్టకు. వాడికి కావలసినంత పట్టుకుపోనీ - మన ప్రాణాలు మనకి మిగిలిపోతే చాలు' అంటారమ్మా ఏంచెప్పను - ఆయన పిఱికితనం అలా అఘోరించబట్టే ఇంటెడు ఆస్తీ ఎగిరిపోయింది - అని కన్నీళ్ళు గుక్కుకుంటూంది యింకో ఆమె. ఇలాగ పకాలు దొంగతనాలు - సాహస దొంగతనాలు - కథలుగా చెప్పుకుంటూ ఆ దొంగల పాపం యిన్నాళ్ళకి గదా భళ్ళున బ్రద్దలయింది అంటూ వ్రేళ్ళు విరుస్తున్నారు అక్కడివారు.

ఊరేగింపుతో - ప్రజల మెప్పుల కుప్పగా-భర్త విజయవిలాసంతో బయలుదేరి వస్తున్నారని విని సుశీలాదేవి ఎంతో సంబరపడింది. నిజంగా - ఆనాటి తన శుభాకాంక్ష - ఆ కర్పూర నీరాంజనం - ఆ వీరతిలకం - సార్థకమై - సత్ఫలాన్ని సమకూర్చినందుకు సుశీలాదేవి బ్రహ్మానందపడింది. అంతా హారతి పళ్ళేలతో నిలిచివున్నారు నీరాంజనాలీయడానికి.

◆ ◆ ◆

ముందు మంగళవాద్యాలు, తరువాత ఆనంద నృత్యాలు, ఆతరువాత పరివారం ప్రతాపసింహునికీ జై! అనే వీరాశ్వకాలు. ఆ మధ్యనే అలంకరింపబడిన ఏనుగు, పట్టు పరుపుమీద - పూలదండలతో - మిసిమిసి నగుమోముతో - ఆసీనుడై వున్న ప్రతాపసింహుడు. ఏడాపెడా రక్షకభటులు. ఆ వెనుక వీరసైనికదళం. అంతా ఆనందోత్సవం, నరకాసురుని వధించి - దీపావళి చేసుకున్నట్లుగా - ప్రతి ముఖంలోనూ - అమానవరాక్షస వంశనాశనకారణంగా మెరిసి మురిపించే నవీనకాంతులు! జీవిత భారాన్నే మరపించే ఆనందజ్యోతులు!! ఆహా! ఆవూరేగింపు అందర్ని దరహాసపరవశుల్ని చేస్తూ - హాయిగా సాగుతూంది పెళ్ళినడకలాగ.

ఎవరనుకొన్నారు? హఠాత్తుగా వూరు చేరకముందే - కొంచందూరంలోనే ఆవూరేగింపు అలా ఆగిపోతుందని ఎవరనుకొన్నారు? ఎందుకూ అలా ఆగిపోయింది? ఎవరూ? ముందుకు పోవటం లేదే. మంగళవాద్యాలు మూగవడ్డాయి. వైతాళికుల గొంతుకలు మూతపడ్డాయి. అంతటి ఆనంద యానం ఏ గంగలో కలిసింది? అయ్యో! అందరూ అంత కంగారు పడతారెందుకు? ఒక్కరూ ఏంజరిగిందో చెప్పరేమిటి?

అదిగో - అంతా ఆ ఏనుగదగ్గఱ గుమిగూడుతున్నారు. ఆతురతతో తొంగి తొంగి చూస్తున్నారు ఏనుగు నడవటంలేదు. ఎంచేత? అక్కడేదో ప్రమాదం జరిగిందా? ఆ జనసమూహంలో ఆతురత ఎక్కువయిందేం. "పట్టుకోవాలి రండి - వెతుకుదాం." అంటూ కొందరు కత్తులతో - కటార్లతో పోతున్నారు. ఏనుగమీదనుంచి ఒక వ్యక్తిని మెల్లిగా క్రిందకుదించుతున్నారు గంజీకావడికట్టి, అతడెవరు? మావట్టీడా? ఒక పదునైన కత్తి కంఠంలోంచి

దూసుకుపోయింది. శరీరమంతా రక్తమయం. అలాగ నెత్తుటివరదలపాలయిన ఆవ్యక్తి ఎవరు? ఇంకెవరు? ఈ ఆనందోత్సవానికి కారకుడు. దుష్టశిక్షణ - శిష్ట రక్షణ చేయడానికి కంకణంకట్టుకొని - శాంతి స్థాపనకు ముందంజవేసిన సౌశీల్యమోహనుడు - తెలియ్యా! మన ప్రతాపసింహుడు. ఎవరింతటికసికట్టి అసిధారకు ఆహుతి చేసింది? ఎవరీ పుణ్యమూర్తిని గాయపరిచినది? ఈ విజయోత్సవాన్ని ఈ వీర పూజనీ చూడలేక - దేవుడేకళ్లుకట్టుకొని - యింతటి దురంతాన్ని ప్రేరేపించాడా? ఈ ఆకస్మికప్రమాదానికి కారకులు - ప్రేరకులు - ఆ మోదకులు ఎవరైవుంటారు? మాట - మంతిలేక మగతతో పడి వున్నాడే ప్రతాపసింహుడు! సరసం విరసం అయింది. చూస్తుండగా నిండు పున్నమవెన్నెల మబ్బు మాయమై గాఢాంధకారం కమ్మేసింది. అంతంలేని ఆనందం అంతంలేని చింతగా మారింది!

ఎదురుచూచే ఇల్లాలికేదిదారి? ఈ త్యాగరాయని మంగళ విగ్రహాన్ని మనసారా దర్శించి - కృతజ్ఞత వెలిబుచ్చుకోవాలని - ఎంతసేపటినుంచో నిలిచి నీరాంజనాలను ఇయ్యడానికి ఎదురుచూచే ఆ అమాయక పౌరులతో ఏంచెప్పేది! ఘడియ ఘడియకూ అందరికీ ఆతురత పెరుగుతోంది. ఇంతమంది పుర జనుల ప్రాణాలను కాపాడిన యీ త్యాగరాజు ప్రాణాల్ని - ఎవరూ నిలబెట్టలేరా? ఈ పావన జీవనజ్యోతి యిలా చల్లారిపోతూంటే ఎవరికీ రక్షించే ఉపాయం తట్టలేదా? అని అందరూ అనేక విధాల తహతహపడుతున్నారు.

అంతలోనే మళ్ళీ అలజడి, గుఱ్ఱాల డెక్కల చప్పుడు. "పరమనీచుడు వీడే!" అనే ఘాటు మాటలు, ఆ మాటల ధాటీమధ్య - ఆ వేడి చూపుల మధ్య - అందరిచేతా - అన్ని విధాలా - లెంప కాయల లగాయతు పేపబెత్తం దెబ్బలవఱకూ తింటూ - అనరానిమాటల్ని - వినలేని దూషణల్ని విధిలేకవింటూ - పలాయనం సాగించడానికి మరో దారిలేదని కుంగిపోతూ - తనంతటతానే చావడానికి సాధనం దొరకకపోవడంవల్ల తల్లడిల్లుతూ - బ్రతికి వుండీ చచ్చిన శవంలాగవున్న ఒక వ్యక్తి వస్తున్నాడు. ఎవడీవ్యక్తి? అనే ప్రశ్నార్థకమైన వీక్షణాలు. 'ఎవడా! వీడే - మన ప్రతాపసింహుని ప్రాణాల్ని బలిగొన్న మానవరాక్షసి' - అనుకుంటున్నారు కొందరు. ఆఁ అంటూ అంతా అతనివైపు చూశారు పగబట్టి బుసకొట్టే పాములలాగ, ఆ కోపాల చూపులలో ఎన్నో శాపాలు వర్షించినయి.

సరిగ్గా - యిదే సమయానికి ప్రతాపసింహుడు తుదిసారి వూపిరివదిలాడు. ఆ కీర్తిమూర్తి భౌతిక దేహాన్ని బంగారు జలతారు శాలువాతో కప్పారు. మళ్ళీ ఆ ఏనుగుమీదవున్న అంబారీలో వుంచారు. అందరి ముఖాలలోనూ ముఖారిరాగనీడలే.

ఇంతవరకూ ఎంతో ఆనందించాం. ఇంక మన ఆనందం మట్టిపాలయింది. ఆనందం చూస్తూండగా వికారరూపాన సాక్షాత్కరించింది. విచారం మనకి దాపురించింది. ఇక యేడుద్దాం. ఏడుపురాగాలు తీయండి. ఏడుపుముఖాలు పెట్టండి. ఏడుపుచూపెట్టండి. మనకి శాంతిభిక్ష పెట్టిన - మనత్యాగరాజు మనకింకలేడు. అదుగో! అలాచూడండి! ఆ మనిషివైపు చూడండి. బంధీభూతుడైన ఆ మానవ రాక్షసిని చూడండి. వీడే చోరనాయకుడు. వీర బాహుడు! పిరికిపందలాగ పరారీ అయిన దొంగల దొర! చాటు మాటున పొంచివుండి - పదునుకత్తిని గురిచూచి ఘాటుగా వదిలిన క్రూరుడు. కసిదీర్చుకొన్న కఠినకంఠుడు! మనప్రతాపసింహుని కడుపున పెట్టుకొన్న కిరాతకుడు - పొగరుతో ఎంత ఎగిరితేనేం - చివరకు మన చేజిక్కిపోయాడు. వీడి పంచ ప్రాణాలూ మీ అందరిచేతుల్లో వున్నాయి. ప్రతాప సింహుని ప్రాణాలు తీసిన వీడి ప్రాణాల్ని - తేలికగా మీరు తీయచ్చు, నేరస్థుణ్ణి సజీవంగా మీ యెదుట పెట్టడమే నా బాధ్యత. ఈ హంతకునికి యెలాటి శిక్ష విధించాలో ఆలోచించండి - మనమే కాకుండా మనతరతరాలవారుకూడా మరిచిపోలేని శాంతిదానం మనప్రతాపసింహుడు మానవజాతికి చేసి తనువు చాలించాడు.

(సశేషము)

# అమెరికాలో నేటికీ మిగిలిఉన్న నార్తాంప్టన్ చేనేత రీతులు

—(౦)—

నార్తాంప్టన్ నగరం (మెసాచుసెట్స్) అనాదిగా చేనేతకు ప్రసిద్ధి. నేటికీ ఆ పట్టణంలో స్త్రీలు పురాతన అమెరికన్ డిజైన్లలో చేమగ్గాలమీద బట్టలు నేస్తూ ఉన్నారు. వాళ్లు భారీయెత్తున బట్టలు ఉత్పత్తిచేయక పోవచ్చునుగాని వాళ్లు నేసే ఉడుపులలో వాళ్ల కళాగరిమ కనుపిస్తుంది. అందమైన, ఆకర్షవంతమైన డిజైన్లలో వాళ్లు బట్టలు నేస్తారు.

న్యూ ఇంగ్లండ్‌లో స్థిరపడిన తొలివలస దారులనాటి నేత రీతులను నేటికీ వాళ్లు అనుసరిస్తున్నారు. అమెరికన్ ఉన్ని లినెన్లు ఉపయోగించి నయనానందకరంగా వస్త్రాలు నేస్తారు.

విగిన్స్‌టేవరిన్‌కు చెందిన పురాతన చేనేత మందిరంలో స్త్రీలు నేతపని చేస్తుంటారు. విగిన్స్‌టేవరిన్ ఒక ఐతిహాసిక వస్తు ప్రదర్శనకేంద్రం. ఇక్కడ వీరు నూరు సంవత్సరాలనాటి మగ్గాలు, రాట్నాలు, బుడుతలు వగైరా పరికరాలు ఉపయోగించి బట్టలు నేస్తుంటారు. ఒక పరుపు గలేబుమీద ఒక రోజా పుష్పం నేయటానికి మగ్గపునాడె 50 సార్లు తిరగాలి. అయితే ఎంత వ్యవధి తీసుకున్నా ఒక కళా ఖండం తయారౌతుంది.

ఈ టావెరన్ చేనేత పరిశ్రమ కేంద్రానికి దేశదేశాలనుంచి యాత్రికులు వస్తుంటారు. నార్తామ్టన్ స్త్రీ నేత నైపుణ్యాన్ని మెచ్చుకుంటూ ఉంటారు.

## భారత చేనేత వస్త్రాల రీతులు అమెరికన్ అతివల ఆసక్తి

—(౦)—

భారతీయ చేనేత వస్త్రాలపట్ల అమెరికన్ మహిళలు అత్యంత ఆసక్తి ప్రదర్శిస్తుంటారు.

"వస్త్రోత్పత్తి విషయంలో భారత ప్రాచీన సంపద అత్యద్భుతమైనట్టిది" అని ఇండియాలో ఒక సంవత్సరంపాటు చేనేత వస్త్రాల డిజైన్లను పరిశీలించి వెళ్లిన అమెరికా ఫుల్‌బ్రైట్ విద్వాంసురాలు మిస్ నాన్సీ కెలియాలి అభిప్రాయం వెలిబుచ్చింది.

"నేతకు అద్దకానికీ భారతదేశం తల్లి వంటిది. అందుచేతనే భారతీయవస్త్రాలు రకరకాల డిజైన్లతో అత్యద్భుతంగా ఉంటవి" అన్నదామె.

ఈమె బరోడా విశ్వవిద్యాలయంలలిత కళల విభాగంలో భారతీయ వస్త్రరీతులలో పరిశోధన జరిపింది. వివిధ వస్త్ర

రీతులను పరిశీలించుటయే కాకుండా, స్వయంగా ఆయా డిజైన్లలో బట్టలు నేసింది. స్వయంగా మగ్గం తయారుచేసుకున్నది. దేశంలో వివిధ చేనేత పరిశ్రమ కేంద్రాలను సందర్శించి వివిధ నేత పద్ధతులను గ్రహించి, స్వయంగా అనేక నమూనాలలో బట్టలు నేసి స్వదేశానికి తీసుకెళ్ళింది.

మిస్ కెలియా కాశ్మీరు శాలువలను, అక్కడి శోభాయమానమైన కుట్టుపనులను, రాజాస్థాన్ భండారీ అద్దకాన్ని హైద్రాబాద్ హిమ్రూ బ్రోకేడ్లను, దక్షిణాది పట్టు వస్త్రాలను పరిశీలించింది.

ఈమె ఎక్కడికి వెళ్ళినా భారతీయ వస్త్రాల రంగులు, వాటి సొగసు ముగ్ధురాలుని చేసినవి. నిగనిగలాడుతూ కొట్టవచ్చినట్టు కనపడే ఎర్రరంగు, బంగారు ఛాయ గల నారింజరంగు ఆమెను అమితంగా ఆకర్షించినవి. రంగులతో పాటు వస్త్రాల మీద ఉండే కళాకృతులు - మామిడి పండు, చిలుకలు, ఏనుగలు, నెమళ్లువగైరాలు ఆమెకు ఎంతో ప్రీతికలిగించినవి.

"భారత దేశంలో నేను చూచిన నేర్చుకున్న వాటి ప్రభావం మున్ముందు నేను చేనేత మీద ప్రసరింపకమానను. అయితే ఆప్రభావం ఏ రూపంలో ఉంటుందో చెప్పలేను" అని మిస్ కెలియా అన్నది.

డిజైన్లు తయారు చేయుటంలో ఆమెకు గతానుభవం చాలా ఉన్నది. న్యూయార్కులోని డరోతీ లీబ్స్ డిజైన్ స్టూడియోలో పనిచేసింది. అక్కడ ఆమె చేమగ్గాలమీద వస్త్రాల డిజైన్లు తయారు చేసేది. వాటిని ఉడుపులు, వస్త్రాలు, గృహాలంకరణలు, ఫేషన్ డిజైన్లు తయారు చేసేవారికి పంపించేది. ఆ డిజైన్లు కొన్ని మిల్లు బట్టలమీదకూడా ఎక్కేవి.

"ఇండియా అమెరికా చేమగ్గాల ఉపయోగంలో ఉన్న పెద్దతేడా ఇదే. అమెరికాలో, చేమగ్గాలను ప్రయోగాలు జరపటానికి మాత్రమే ఉపయోగిస్తారు. లేదా వినోదార్థం వస్త్రాలు నేసేవారు మాత్రమే ఉపయోగిస్తారు. ఇండియాలో మాదిరిగా లక్షలాది ప్రజలకు వృత్తికలిగించే చేనేత పరిశ్రమ అంటూ అమెరికాలో ఏదీ లేదు" అన్నది మిస్ కెలియా.

——(०)——

# కేనోపనిషదు

మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం:
డాక్టరు W. రా. కృష్ణయ్య



(గత సంచిక తరువాయి)

ఓం. బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే.
తస్య హ బ్రహ్మణో విజయే
దేవా అమహీయన్త । త ఐక్షన్తా
స్మాక మేవాయం
విజయోఽస్మాక మేవాఽయం మహి
మేతి ॥ 1.

గురువు:—ఒకానొకప్పుడు బ్రహ్మ, దేవతలకొరకు అసురులను యుద్ధమున జయించెను. బ్రహ్మవలన జయము కలిగియుండినను, దేవతలు అహంకరించి, "ఈ విజయము మా వల్ల కలిగినది. ఈ మహిమ యంతయు మాది" అని తలచుచుండిరి.

తద్ధైషాం విజజ్ఞౌ తేభ్యో హ
ప్రాదుర్బభూవ
త న్న వ్యజాన న్త కి మిదం యక్ష
మితి ॥ 2.

వారి అహంకారమును బ్రహ్మ గమనించి వారి ఎదుట ప్రత్యక్షమాయెను. కాని వారు ఈ యక్ష స్వరూప మెవరని తెలుసుకొనలేరైరి.

తేఽగ్ని మబ్రువన్ జాతవేద ఏత
ద్విజానీహి
కి మేత ద్యక్షమితి ; తథేతి ॥ 3.

వారు అగ్నిదేవునితో "ఓ జాతవేదా ! (సర్వజ్ఞా)! ఈ యక్షుడెవరో తెలుసుకొనుము." అనిరి. అతడు సమ్మతించెను.

త దభ్యద్రవ త్త మభ్యవద త్కో
సీతి
అగ్ని ర్వా అహ మస్మీ త్య బ్రవీ
జ్జాత వేదా అహ మస్మీతి ॥ 4.

అగ్నిదేవుడు యక్షునివద్దకు వెళ్లెను. యక్షుడు నీ వెవరు అని అగ్నిని అడిగెను. అగ్ని, "నేను అగ్ని, సర్వజ్ఞుడను" అని తెలిపెను.

తస్మిం స్త్వయి కిం వీర్య మిత్యపీదం
సర్వం దహేయం యదిదం పృథివ్యా
మితి ॥ 5.

యక్షస్వరూప బ్రహ్మము అగ్నిని అడిగెను "చాల గొప్పవాడుగ నున్నావు. నీకు ఎంత శక్తి యున్నది. తెలుపుము." "నేను ప్రపంచమునగల సర్వమును దహించగలను."

తస్మై తృణం నిదధా వేతద్దహేతి,
తదుపప్రేయాయ
సర్వజవేన త న్న శశాక దగ్ధుం స తత
ఏవ నివవృతే
నైత దశకం విజ్ఞాతుం య దేత
ద్యక్ష మితి ॥ 6.

బ్రహ్మము ఒక గడ్డి తృణమును అగ్నిముందువైచి, "దానిని కాల్చుము" అనెను. అగ్ని తన శక్తి యంతయు ఉపయోగించెను. కాని దానిని దహించ లేకపోయెను. అతడు మరలపోయి, "ఈ యక్షుని

తెలియుటకు నాకు సాధ్యముకాదు" అని దేవతలతో తెలిపెను.

అథ వాయు మబ్రువన్ వాయువేత
ద్విజానీహి
కి మేత ద్యక్ష మితి ; తథేతి ॥ 7.

పిమ్మట దేవతలు వాయువును "ఓ వాయుదేవుడా! ఈ యక్షుడెవరో కనుగొనుము." అని వేడిరి. అతడు సమ్మతించెను.

తదభ్యద్రవ త్తమభ్యవద త్కో౽సీతి
వాయు ర్వా
అహం మస్మీ త్యబ్రవీ న్మాతరిశ్వా
వా అహం మస్మీతి ॥ 8.

వాయుదేవుడు యక్షునివద్దకు వెళ్లెను. అతడెవరని యక్షుడు ప్రశ్నించెను. "నేను వాయువు. నా పేరు మాతరిశ్వుడు (ఆకాశ సంచారి)" అని అగ్ని తెలిపెను.

తస్మిం స్త్వయి కిం వీర్య మి త్యపీదం
సర్వ మాదదీయం య దిదం పృథివ్యా
మితి ॥ 9.

"గొప్పవాడుగా నున్నావు. నీకేమి శక్తి యున్నది?" అని యక్షుడు ప్రశ్నించెను. "నేను ఈ భూమిమీదనుండు దేనినైనను ఎగురగొట్టగలను." అని వాయువు చెప్పెను.

తస్మై తృణం నిదధా వేత దాథ
త్స్వేతి తదుప ప్రేయాయ
సర్వజవేన తన్నశశ కాదాతుం సతత
ఏవ నివవృతే
నైత దశకం విజ్ఞాతుం య దేత ద్యక్ష
మితి ॥ 10.

యక్షుడు అతనిముందు ఒక గడ్డిపోచనుంచి "దీనిని ఎగురగొట్టుము" అనెను. వాయువు తన సర్వశక్తులతో ప్రయత్నించి, దానిని కదలించలేకపోయెను. అందువల్ల అతడు దేవతలవద్దకు మరలివెళ్ళి, "ఆ యక్షుడెవరో నేను తెలుసుకొనజాలను" అని చెప్పకొనెను.

అథేన్ద్ర మబ్రువన్ మఘవ న్నేత
ద్విజానీహి
కి మేత ద్యక్ష మితి ; తథేతి ; త
దభ్యద్రవ త్తస్మా త్తిరోదధే ॥ 11.

దేవతలకు ప్రభువగు ఇంద్రుని దేవతలు వేడుకొనిరి. "ఓ! మఘవన్! (గొప్ప శక్తి సంపద గల మర్యాద పురుషుడా!) ఈ యక్షుడెవరో తెలుసుకొనుము" అనిరి. అతడు సమ్మతించి యక్షుని సమీపించెను. యక్షుడు అతని దృష్టినుంచి మాయమాయెను.

స తస్మి న్నేవాకాశే స్త్రియ మాజ
గామ బహుశోభమానా
ముమాం హైమవతీం తాం హోవాచ
కి మేత ద్యక్ష మితి ॥ 12.

ఆకాశమున యక్షుడున్న స్థలముననే బహు అలంకారములు గలిగిన ఉమాదేవి, హిమవంతుని పుత్రి,- కనబడెను. యక్షుడెవరుగా నుండవచ్చును అని ఆమెను ఇంద్రుడు ప్రశ్నించెను.

ముందు తెలుపబడిన శాస్త్రనియముల ననుసరించి, ఈ పిట్టకథయందు దాగియుండు వేదాంత విశేషమును తెలుసుకొన ప్రయత్నించెదము. పంచభూతములను పంచజ్ఞానేంద్రియములను తెలుపుచున్నవి. ఒక్కొక్క భూతము ఒక్కొక్క జ్ఞానేంద్రియమునకు అధిష్టాన దేవతగ యున్నది.

దేవతయనగ మనలోనుండు సుగుణ సంపద అని యెంచవలెను. ప్రేమ, ఓర్పు, శాంతము, దయ, దానము, భక్తి, కనికరము ఇవన్నియు సుగుణములు.

వీటినే దేవతలు అనబడుచున్నవి. మృగచేష్టలను ద్వేషము, క్రోధము, మాత్సర్యము, అసూయత, స్వార్థతము, అహంభావము మొదలగునవి అసురులు. (అసురభావములు) సాధకుడు ఆరంభదశయందు తన సాధనవల్లనే అహంకరించి, తాను ధ్యానముచేయగల కాలపరిమితిని, తాను సాధన చేయు సుగుణములను తనకు కలుగు అనుభవములను ప్రకటించుకొనగలడు. ఇట్టి సుగుణములు ఆ నిత్యపరమాత్మయొక్క కటాక్షమువల్ల అభివృద్ధిపొందుచున్నవని తెలియక, అసురగుణములనెల్ల తానే గెలువగలిగితినని గర్వించును.

అట్టి సమయములలో పరమాత్మ ఒక వింతయగు స్వరూపముతో సాధకునికి ప్రత్యక్షమయి, అట్టి స్వరూపమువల్లనే సాధకుని ఆత్మవిచారమునకు పురికొల్పును.

మరియు, సాధకులు, అనుభవము లేనందువలన, పరమాత్మను సాకారముతో చూడ యత్నించెదరు. అగ్ని సాహసముతో, యక్షుని తెలుసుకొనుటకు వెళ్ళి గర్వపడుట యనునది, నామరూపములతో పరమాత్మ తెలియబడదు అను సూత్రమును రూఢిచేయుచున్నది. అగ్ని పరమాత్మయొక్క అనుగ్రహము లేనిది ఒక గడ్డిపోచనుకూడ కాల్చలేడనుటవల్ల, కన్నుకు కన్ను యొకటి యున్నది. దాని శక్తివల్లనే కన్ను చూడగలుగుచున్నది అని తెలియుచున్నది. వాక్కునకు శక్తినొసగు వాక్కు లేనియెడల వాక్కు మూకత్వమును వహించవలసి యున్నది.

ప్రపంచమునంతయు ఎగురకొట్టగల శక్తి తనకున్నదని తలంపుకున్న వాయుదేవుడు తలవంచి పరుగిడి పోవలసివచ్చెను. దానివల్ల అతనికి, సర్వశక్తులకు మూల శక్తియగు ఆత్మ కటాక్షము లేనిది తాను ఒక గడ్డి పోచనుకూడ కదలించలేనని అతడు తెలుసుకొనెను. మనయందు జ్ఞానేంద్రియములలో ఘ్రాణమునకు, కర్మేంద్రియములలో ఉపస్థేంద్రియమునకు అధిష్టాన దేవతయగు పరమాత్మయొక్క కటాక్షము లేనిది మనము గంధమును తెలుసుకొనజాలము. సంతతిని పొందజాలము అని తెలియుచున్నది.

అగ్నిదేవుడు, వాయుదేవుడు యక్షుని స్వరూపము తెలుసుకొనలేకపోయిరి. అనగా, ఆత్మ స్వరూపము, ఎఱిగినవానికి, ఎఱుగలేని వానికి అతీతము - సర్వమును ఎఱుగు ఎఱుకి - అని తెలియుచున్నది (అన్య దేవ తద్ విదితదథో అవిదితాదధి)

కడపట, సాధకుని యందలి సుగుణములన్నియు కలసి, ఇంద్రుని ప్రార్థించుచున్నవి. ఇంద్రియములకు రాజు ఇంద్రుడు. జ్ఞానేంద్రియములకు అధిపతి మనసు. సుగుణములన్నియు ఏకముగ, ఆత్మను తెలియుకోరగా మనసు, సామాన్యజ్ఞానముగ పరమాత్మను తెలుసుకొన ప్రయత్నించగలదు. అనగా జ్ఞానేంద్రియముల, కర్మేంద్రియములద్వారా. కనుక అచ్చట అపజయ సిద్ధముగనున్నది. కాని ఆత్మజ్ఞానమునందు అభిరుచిమిక్కుటముగనున్న యెడల మనసుతో ఆత్మను తెలియ ప్రయత్నముసాగగలదు.

సాధకుని మనసు ఇంద్ర స్థితి పొందినచో, అహంకారము తొలగి, జ్ఞాన ప్రాప్తికి సాధన చేయును. మనసు సమీపించగా, పరమాత్మదృశ్యము తొలగిపోవుచున్నది. తనయందే ఆత్మను వెదుకునపుడు సాధకునికి సాధనలయమగుచున్నది. అందువల్ల సంస్కరింప బడని సాధకులు యక్షుడనునది కేవల మాయ నాస్తికమని తలచుచున్నారు. బౌద్ధమతమున నాస్తికవాదులు, తర్కవాదులు తమ కార్యము సఫలముపొందక అగ్నివాయువులు వాపసు వెళ్ళినట్లు ఇంద్రుడుకూడ అపజయముతో వాపసు వెళ్ళినట్లను భవించుచున్నారు.

ఇట్టి ప్రమాదము కలుగగలదని శ్రుతిమాత ఈ కథయందు సూచించుచున్నది. ఇంద్రపదవియందు తొందరపడక శాంతముతో ఆత్మయొక్క సత్యజ్ఞానము పొందువరకు పరిశ్రమచేసినచో జయము తప్పక చేకూరును. చక్కని ఇంద్ర పదవి పొందిన వేదాంత సాధకుడు తప్పక విజయమును పొందుచున్నాడు.

యక్షరూపము మాయమగుటవల్ల నిరుత్సాహము

పొందక ఇంద్రుడు తన సాధన వల్ల, యక్షరూప మగుపడిన ప్రదేశమును, తీవ్ర శ్రద్ధతో, ఆత్మజ్ఞానము పొందవలెనను తీర్మానముతో, ఎట్టికోరికలు, ఫలములు, కొరతలు లేక దృష్టించుచుండెను. అట్టి అంతర ప్రశాంత సమయములలో, సాధకుని ఎఱుకయందు జ్ఞానమాత, శ్రుతిమాత ప్రత్యక్షమగుచున్నది.

ఉన్నత ఆశయము, దైవిక తీర్మానము హృదయ పూరిత శ్రద్ధ, అహంకారహితమనసు, ఎఱుక, విచక్షణ గల బుద్ధిగల సాధకుడు ఇంద్రపదవి పొందినవాడగు చున్నాడు. అతనికి జయము తప్పక చేకూరును. కాని అతనియందు వినయము, అహంకారరహితము, తీవ్ర సాధన చేకూరియుండవలెను.

జీవితరంగమున కొంత ప్రమాదములు కలిగినచో వాటిని తప్పించుకొనుటకు ప్రయత్నించువానికి మత సిద్ధాంతములు సహాయపడవు. తాను తలచిన పందెపు గుఱ్ఱము గెలువలెనని దేవళమునకు వెళ్ళి ప్రార్థనచేయు వాడు సంఘద్రోహి, మతద్రోహి. ఆత్మహత్యచేసు కొను ఉన్మాదునికన్న ఇతడు నీచుడని తలచవలెను.

ఇంద్రుడు ఆత్మదర్శనమునకై చాలకాలము వేచి యుండవలసిన అగత్యమేర్పడలేదు. హృదయనివాసి యగు ఆత్మ తన భక్తులను అనావశ్యముగ వేచి యుంచదు. హృదయ ప్రశాంతిమున వెలయు బ్రహ్మ విద్యారాణి, ఉమాదేవి, హిమవత్పుత్రి, యక్షు డుండిన స్థలమున ప్రత్యక్షమాయెను. పరిపక్వదశ పొందిన సాధకునికి శ్రుతి మాత సుఖముశాంతము కలిగించి, మార్గముచూపి, ప్రోత్సహించి, తరింప జేయును. ప్రథమమున శ్రీహిమవత్పుత్రి వాక్కువలన యక్షుడు పరమాత్మ యొక్క ప్రత్యక్షస్వరూపము అని ఇంద్రుడు వినగలిగెను. ఆ పరమాత్మ భ్రమించు జీవుని అజ్ఞానమును తొలగించుటకు పరిచ్ఛిన్న జీవభావమును మోహములను పోగొట్టుటకు జీవుని ఆశీర్వదించుటకు రూపముతో ప్రత్యక్షమాయెను.

జ్ఞానమాత వాక్కునుండి వినబడిన జ్ఞానము పరోక్ష జ్ఞానము అనబడును. సాధకుడు దీనిసహాయమున సర్వశ్రమలను తొలగించుకొని ఆత్మసన్నిధానమును చేరజాలడు. పరిమితులు లేని, కాలదేశావస్థలు లేని దశయే మోక్షము అనబడును.

గురుముఖమున వినబడు సత్యసిద్ధాంతములను సాధకుడు స్వానుభవమున పొందగలిగినచో ఈ పద విని చేరగలుగుచున్నాడు. మనయందలి అంత రాత్మయే సర్వవ్యాపక పరమాత్మయని తెలుసు కొనినచో మనభ్రమలు, దుఃఖములు తొలగుచున్నవి.

జ్ఞానాదేవతు కైవల్యం

(సశేషము)

——(o)——

## గ్రంథులను కనిపెట్టే పరికరం

శరీరారోగ్యానికి ప్రమాదకరమైన గ్రంథులను, అవి ఎంత చిన్నవైనా కనిపెట్ట డానికి మాస్కో శాస్త్రజ్ఞులు ఒకసూపర్ - సోనిక్ సాధనాన్ని కనిపెట్టేరు. గ్రంథి చుట్టూవున్న ధాతువులనుండి వచ్చే సూపర్‌సోనిక్ తరంగాలను విద్యుత్ అలలుగా మారుస్తుందీ పరికరం; దానివల్ల గ్రంథి ఆకారాన్ని టెలివిజన్ తెరపై చూడవచ్చు. ఎక్స్‌రే యివ్వలేని ఫలితాలను కూడా యీ పరికరమివ్వగలదు.

# రెండు గొప్ప లాభాలు



మెట్రిక్ విధాన తూకాలు, కొలతలకు మార్పువల్ల మనకు రెండు ప్రధాన విధాల లాభిస్తుంది. మన దేశంలో ప్రస్తుతం అనుసరింపబడుతూన్న నానా పద్ధతుల మూలాన కలుగు కలతలు, నష్టాలూ అంతరిస్తాయి.



అంతర రాష్ట్రీయంగా అనుసరింపబడుతూన్న ఒకే పద్ధతిని మనమూ వాడకంలోకి తేగలుగుతాము. మెట్రిక్ పద్ధతిని ప్రపంచమంతటా గల అన్నిదేశాలూ అంగీకరించాయి.




ఈ ద్విముఖోద్దేశ పద్ధతిని సాధించడానికి తొలిమెట్టుగా ఇది మనదేశంలో ఏర్పుకొన్న కొన్ని కొన్ని రాష్ట్రప్రదేశాలలోనూ, పరిశ్రమలలోనూ ఇదివరకే ప్రవేశ పెట్టబడి యున్నది.




**సులభతరం చేయడానికి ఏకరీతి వాడకానికీ**

DA 58/432

ఇండియా ప్రభుత్వము వారిచే ప్రచురింపబడినది.

# ప్రకృతి తత్త్వము

శ్రీ వేదము వెంకట కృష్ణశర్మ



(జనవరి సంచిక తరువాయి)

'విష్ణుమాయ,' 'చిచ్ఛక్తి', 'ప్రకృతి'-యని పెద్దలు చెప్పిన ఆప్రపంచ సామాన్యములగు సర్గ, స్థితి, లయముల మూలకందము యొక్క స్వభావ నిరూపణమును జేయుచు, నందులకుఁ గొన్ని యుదాహరణములు కడచిన నెల 'గృహలక్ష్మి'లో వివరించితినిగదా! అట్టివి మన పురాణాదులలో శతాధికములుగఁ గలవు.

ప్రకృతి 'అచింత్య మాయామయ', 'మానవాతీత కార్యనిర్వహణ ధురీణ';- 'మర్త్యామర్త్యలోకవ్యాప్త'; - అజ్ఞాతశీలాంచిత. ప్రకృతి సహజసిద్ధమగు చైతన్యము గలది; అదిలేని పురుషుఁడు కేవల మొక జడస్వరూపుఁడు. పురుషుఁడు ప్రకృతిమాయచేఁ బ్రవర్తించు ప్రపంచ వ్యవహారములకు నామమాత్రావలంబనము. కావుననే ప్రకృతికృత మాయాధీనుడయి యుండునంతవఱకే ఆతని యాధిక్యము. ప్రకృతి సాహచర్యము లేనినాఁడతఁ డొక్కయడుగయిన ముందునకుఁ బెట్టఁజాలఁడు. ప్రకృతి తన మాయాప్రభావమున వ్యామోహితునిఁ జేసినఁగాని, యతని యందలి పుంభావమున కుద్రేకము గలుగదు. అప్పుడుగాని అతని చర్యలకది సహాయకారి గాఁజాలదు.

ప్రకృతి మాయాజాలము యమునిఁ గూడ వశవర్తిని జేసికొనఁగలదు. సూర్యచంద్రుల గమనము నాఁగగలదు. ఇకఁ జచ్చినమగని బ్రదికించుకొనఁజాలదా? తనపతి జీవములు హరించిన యముని వెంబడి చన్న సావిత్రి మన కీసందర్భమున స్మరింపఁదగినది. పట్టుదలతో వైవస్వతుని ముప్పుతిప్పలు పెట్టి, మెప్పించి తుట్టతుదకు పట్టు నెగ్గించుకొన్నదాభాగ్యవతి. స్త్రీలోని మాయాశక్తి అంతటి మహిమ గలది, ఏదీ? ఆరీతి చచ్చిన సతీతిలకమును మరల బ్రతికించుకొన్న పురుషు నొక్కనిఁ జూపుఁడు, చూతము. ఏదియో సర్పమొండు భార్యను గఱచిచంప, నామెం బ్రదికించుకొను వెర పెఱుంగక కనఁబడిన పాముల నెల్లఁ జంపినాఁ డొక ఘనుఁడు! పరమ పావనయగు తనవల్లభను - గంగను గంగలోఁ గలిపి, బెస్త పిల్లను బెండ్లియాడినాఁ డొక పెద్ద మనుష్యుఁడు! ఇంతెందులకు? తన కత్యంత ప్రాణప్రదయగు పెండ్లము మరణింపఁగా, మిక్కుటమగు దుఃఖార్తుఁడైన యజుఁడామెను బ్రదికించుకొనఁ గలిగెనా? అట్టియెడ, అతఁడు ఏడ్చి సాధించినదేమి?— మఱొక వనితను బట్టమహిషినిగాఁ జేసికొనలేఁడేమి? నూటి

నూఁఱుపాళ్లును ప్రకృతి మాయాశక్తిగా చరించిన దేవయాని మగఁడుగా, ఆమె చేతి కీలుబొమ్మవలె మెలఁగిన యయాతి మగనాలుగా నుండియున్నచో పడరాని (యామెవలని) యీతి బాధలకు అగ్గము గాకుండియుండునుగదా! ఇట్టివి ప్రకృతి మాయాశక్తి చర్యలు. కాని, —మహిళల పర్యాయముగ వీని నుగ్గడించునపుడు మన పురాతన గ్రంథములలో మనవారు వీనిని పాతివ్రత్య ప్రభావము క్రింద జమకట్టిరి. ఇదెంతవఱకు సమంజసమో, క్రింది శ్లోకమునఁ బేర్కొనఁబడిన కాంతలయెడఁ బాతివ్రత్యమనున దెట్లన్వయింపఁదగునో పరిశీలింతురుగాక!

"అహల్యా ద్రౌపదీ తారా మందోదరీ
తథా పంచకన్యా స్మరేన్నిత్యం మహాపాతక నాశనమ్"

ఈ శ్లోక రచనా వైఖరింగూర్చి మన కక్కఱలేదు. తత్కర్తంగూర్చి వితర్కమంతకన్న నక్కఱలేదు. కాని, దేశమునఁ బెక్కురనోళ్ళలో నానుచున్న యీ శ్లోకగత నారీరత్నములంగూర్చియే, మనకిట గావలసినది.

పై శ్లోకమునఁ బేర్కొనఁబడ్డవారు కన్యలఁట! బ్రహ్మచారిణులయిన పశ్చిమ ఖండ వృద్ధల సహితము—"మిస్సు" లను నట్లున్నది యిది!— మన పెద్దలన్ననో, "అష్టవర్షా భవేత్కన్యా?"-అని యన్నందున, అంతకుమించిన వయస్సుగలవారిని, నవోఢలని, ముగ్ధలని, ప్రౌఢలని—యీ విధముగఁ వయఃక్రమము ననుసరించి కొన్ని తరగతులవారినిగ నిర్ణయించిరి. అగుచో, పై కన్య లెప్పటివఱకుఁ గన్యలు? —వీరు సిద్ధ సంకల్పలయినది కన్యలుగ నున్నపుడేనా? గానిచోఁ, బాతివ్రత్యమెట్లు సిద్ధించును? అయినదన్న— శ్లోకగత కన్యా శబ్దాభిప్రాయ మెట్లు సమర్థనీయము?— అట్లుగాదు! వారు వివాహితలయ్యుఁ గన్నెలే; సంతానవతులయ్యుఁ గన్యలే. —అన్నచోఁ, పేచీయేలేదు. వీరి చారిత్రములించుకంత సూక్ష్మముగఁ బరామర్శించి చూచితిమేని, — పరిణీతలయిన పిదపఁగూడ వీరి శీలము, శంకాస్పదములుగనే దోఁచును గదా! ఎంత దైవాంశ కలితలయినను— ఐహిక జీవయాత్ర సాగించునెడ లోకాచార వ్యతిరేకమగు మార్గ మవలంబింపరాదుగదా! ఈ సిద్ధాంతము శ్రీరామునిచే స్థాపింపఁబడెనుగదా! లోకాపవాదమునకు జడిసియేకదా! మహాసాధ్వియగు జానకి నాతఁడెడఁబాయవలసి వచ్చెను. లోకాపవాదమునకు అడలియేగదా, తన్నుఁ ద్రికరణశుద్ధిగఁ బ్రేమించిన శకుంతలను దుష్యంతుఁడు నిండు సభలో జేకొనక తిరస్కరించెను.

ఇట్టి ధర్మసందిగ్ధములయందుఁ బ్రమాణీకరింపఁదగినవారినిగాఁ, బై శ్లోకమున

దున్న కన్యల నెట్లు కైకొననగునో యూహింపరాకున్నది :–గమనింపుఁడు :—

1. మహాతపస్వి యగు గౌతముని సతి యగు నహల్య—భర్తను గికురించి విటకాఁడగు నింద్రునిఁ గూడనది.

2. అయిదుగురు పతులకు సతియగు ద్రౌపది చరిత్రము నేమందము? అయో నిజయే యగుఁగాక? లోకాచారము పాటింపవలదా?

3. బృహస్పతివంటి దేవగురునియిల్లాలు భర్తశిష్యుఁడగు శశిని ప్రేమించుట గర్హితము గాదా? (దేవతాంగన లెంతటిఁ దడవినను అసతీత్వ మాపాదింపడనువారితో వాద మొనర్పము.)

4. రెండవ తార భుజబలశాలి యగు వాలిదార. తరువాత సుగ్రీవునికిఁ బట్టమహిషి. ఇది మృగ ధర్మమా? మానవ ధర్మమా?

5. మొదట వైరాగ్యము; పెండ్లివలదని ముష్కరత్వము; తుదకొక దుర్నపతికి సతీత్వము;— అతనింగూడ నిరాకరించి, దశకంఠునికి భార్య. ఇట్లు శీలమునుండి తప్పటడుగులు వేసిన మందోదరికూడ సాధ్వియే.

ఈ తీరున కాంతల శీలవిషయమయి యేల చర్చింపవలసి వచ్చినదన:–సాధారణముగ, వారు మానవాతీత కార్యము లొనర్చుటకుఁ గారణము, వారి సాధ్వీత్వము కాక, వారిలో నిద్రాణమయియుండి, తగిన యదనున జాగరూకత నందిన ప్రకృతిమాయాబలమే. అందులకు తచ్ఛీలము ఒక్కింత సహకారి యగునేమోకాని అంతమాత్రమునఁ బ్రపంచమునే దలక్రిందులు చేయఁ దగుశక్తి వారి కలవడు ననుట విశ్వసింపరాని విషయము.

ప్రకృతి మాయారహస్యము దేవతలకే దుర్జ్ఞేయము. ఇఁక మానవుల విషయము చెప్పవలెనా? — శరీరధారులెల్ల దాని కధీనులే. తప్పించుకొనుట యోగసిద్ధులకును దరముగాదు.

మన పౌరాణిక చారిత్రకోదాహరణము లటుండనిండు. పరాసుదేశమంతయు నట్టుడికినట్టుడికి పోవుచు, నెడతెగని యంతఃకలహములలోఁ గొట్టుకొని చనుచు, సామాన్య ప్రజానీకము దిక్కుదోఁచక ఉసురులిచ్చు తరుణమున నా ప్రళయమున కెదురొడ్డి యొకానొక నిఱుపేదయగు కర్షక కన్య జనాంగమున నుత్సాహ ప్రోత్సాహములు గలిగింపఁగలదని యెవరనుకొనిరి? ఆయబలామణీరూపము యుద్ధవీరుల కానాఁడు సమ్మోహనాస్త్ర మయినది. ఆ బాలికా రత్నము వాక్కులానాఁడు పరాసువారికి వేదఋక్కులయినవి.—సామ్రాజ్యాధిపతులు ఆమె సాహసౌదార్యములకు ముగ్ధులయిరి. రాజ్యాంతం

త్రజ్ఞులగు సమాత్యశతులు కింకర్తవ్యతా మూఢులైరి. కొలంది కాలమే జీవించి యా కన్యకాజన చూడామణి బలవన్మరణ మునకే పాలగుంగాక! ప్రపంచమున్నంత కాలము—వీర నారీ చరిత్రమున నామె పవిత్ర నామము శాశ్వత స్థానము సంపా దించుకొని ప్రకాశించుననుట మాత్రము సత్యము. "జోనాఫ్ఆర్కు"- పరాసుల భాగ్యలక్ష్మికాదా!

హిందూ రాజ్యరమా విభూత్యనుభ వము భారతీయులనుండి తొలగిపోవుటకును, కొన్ని శతాబ్దముల పర్యంతము మన దేశ మాక్రమించికొని మొన్న మొన్నటివఱ కేలుచువచ్చిన నానా జాతులకు నీచాతినీచ ముగ దాస్యమొనర్చు దుర్గతి అరు లకు సంభవించుట మన దేశపాలకుల యనైక్య మునకు దోహదమిచ్చిన "రాణీ సంయుక్త" యొక్క ప్రకృతి నించుక పరిశీలించిన, నామెలో లీనమయియుండిన మాయా శక్తిని మన మూహింపఁగలము "ఆమె పృథ్వీరాజునే వరింప నిశ్చయించిన దృఢ ప్రతిజ్ఞ; అనన్యమనస్క" - అని యేవేవో సాకులు చెప్ప వచ్చును వానికేమి? భావి దేశస్థితి నాలోచింపని చోఁ-గలుగు పరి ణామము నూహింపక పోవుట మాత్రము శోచ్యమే.

(సశేషము)

# పరిణామము

శ్రీ గాడేపల్లి శంకరం

—(౦)—

(గతసంచిక తరువాయి)

## చతుర్థాంకము :

నాల్గవ రంగము

ప్రదేశము : కలెక్టరుగారి ఇంట్లో కచేరీ సావిడి.

ప్రవేశము : డి. వై. యస్. పి. ఆతురతగా పచారు చేస్తూ వుంటాడు.

దఫేదారు:—(ప్రవేశించి) అయ్యగోరు - వస్తున్నారండి-తమర్ని కూర్చోమన్నారండి.

డి. వై. ఎస్. పి. :-భోజనం చేస్తున్నారా ?

దఫేదారు:—లేదండి — ఆరిసాన్నగారు క్లబ్బునించి ఎనిమిది గంటల కొస్తారండి—ఆరువస్తేగాని ఈరు భోజనానికి లెగరు.

డి. వై. ఎస్. పి. :—ఎనిమిది అయిందే (గడియారం ఎనిమిది కొడుతుంది.)

మూర్తి:—(ప్రవేశిస్తూ) వాట్ ఈజ్ ది మేటర్ ?

డి. వై. ఎస్. పి. :-(శాల్యూట్ చేసి—ఆదుర్దాగాను-తడబడుతూ) మేటర్స్, హేవ్, బికమ్ వర్స — సార్ — ఈ వేళ విక్టరీషాపు దగ్గర డాక్టరురావు గారు — దుర్గాభాయిగారి లీడర్‌షిప్ క్రింద — ఒక వలంటీరుబాచ్ పికెటింగు చేసిందండి — సాయంకాలంవరకూ సవ్యంగానే సాగిపోయిందండి — కాని షాపు యజమానికీ వలంటీర్లకీ ఏదో ఘర్షణ జరిగిందట — పెద్ద గలాటాగా మారి పోవడమున్నూ — స్పెషల్ రిజర్వుని తెప్పించి లాఠీచార్జి చేయడమూ జరిగిందండి. ఆ లాఠీచార్జి హడావుడిలో డాక్టరురావునీ — దుర్గాబాయి గారినీ—జనం క్రిందపడేసి తొక్కే—సారుకాబోలు-యిద్దరూ స్పృహతప్పి పడిపోతే — హాస్పిటలులో చేర్పించాము సార్. చేర్చిన వెంటనే డాక్టరు రావు చనిపోయాడండి ...

మూర్తి:—ఆఁ చనిపోయాడా ?

డి. వై. ఎస్. పి. :—అవునండి. హాస్పిటల్ చుట్టూజనం చుట్టేసారు శవం చూస్తామని నానా గలాటా చేస్తున్నారు. ప్రాణాలు అరచేత పెట్టుకొని - సందు గొందుల గుండా తమ దగ్గరకి పారి వచ్చానండి · తక్షణం ఫైరింగుకి... ఆర్డర్స ...

మూర్తి:-ఓ యు వాంట్ ఆర్డర్స ఫర్ ఫైరింగ్ ఇజ్‌న్ట్ ఇట్ ?

డి. వై. ఎస్. పి. :-యస్సర్ ...

మూర్తి:-నాన్సెన్స - కెనాట్ బి గివెన్. ఐ హోల్డ్ యూ రెస్పాన్సిబిల్ ఫర్ ది హోల్ ట్రబుల్. యూ మస్ట్ సీ ది హోల్ సిట్యుయేషన్ ఈజ్ బ్రాట్ అండర్ కంట్రోల్. గో అండ్ బీ దేర్. ఐ — షల్ కమ్ అండ్ సీ ది థింగ్స ఫర్ మైసెల్ఫ

డి. వై. ఎస్. పి. :-(వివర్ణుడై) సర్ ఐ బెగ్ టు ...

మూర్తి:—ఐ సే యూ మస్ట్ గో అండ్ బీ దేర్!

డి. వై. ఎస్. పి. :—యస్సర్ (వెళ్ళిపోతాడు)

మూర్తి:—స్కౌండ్రల్! ప్రామోషన్‌ల కోసం చేసే (ఘోరాలివి) గలాభాలివి—ఇటువంటి దేశద్రోహులుండబట్టే అరాజకం ఏర్పడుతుందిగాని పూర్తిగా బ్రిటిష్ ప్రభుత్వ లోపం వల్లకాదు. పాపం నిండు ప్రాణాన్ని బలిగొన్నారు!

స్వామినాయుడు:-(క్లబ్బునించి తటాలున ప్రవేశించి) నాయనా డాక్టరు రావు చనిపోయాడుట విన్నావా? లాఠీ చార్జిలో చావ దెబ్బలు కొట్టారుట స్పృహతప్పి పడిపోతే పోలీసువాళ్లే — ఆసుపత్రిలో చేర్చారుట — చేర్చిన వెంటనే చనిపోయాడుట — ఇంకో ఆమె ఎవరో దుర్గాబాయిట ఆమెక్కూడా గట్టి దెబ్బలు తగిలాయట — ఆసుపత్రి చుట్టూ జనం చుట్టేశారుట — ఊరంతా గోలగావుంది.

లలిత:-(లోపలనుంచి చటుక్కున ప్రవేశించి) ఏమిటి మామయ్యా! ఎవరు చనిపోయారూ?

మూర్తి:-డాక్టరు రావుగారు చనిపోయాడు.

లలిత:-ఆఁ ఏమిటీ ఘోరం! ఏమీ పాపం!

స్వామి:-లాఠీ చార్జీలో చావ దెబ్బలు కొట్టారుట!

లలిత:-ఏమిటీ దురంతం?

(ఒక్క క్షణం నిశ్శబ్దం)

మూర్తి:-లలితా! ఎంతటి గుణవంతుడనుకున్నావు! నేనంటే అపరిమితమైన అభిమానంగా చూసేవాడు. పాపం (కళ్లనీళ్ళు కారుస్తున్నాడు)

స్వామి:-(కారిన కళ్లనీళ్లు తుడుచుకుంటూ) సాక్షాత్తూ మీ అమ్మకు మేనమామ కొడుకు పక్షిణీ కూడా ఉందేమో?

లలిత:-పాపం—ఏమీ లేనివాళ్ళని కూడా అన్నారు. ఆయన భార్యా పిల్లలగతి ఏమిగాను?

స్వామి:-అదే ఎక్కువగా విచారించవలసిన విషయం అతను ఉన్నన్నాళ్లు — అడపా తడపా జయిలుకి వెళ్ళివస్తూవున్నా — ఏదో ప్రాక్టీసువల్ల పదిరాళ్లు తెచ్చుకొని గౌరవంగా కాలం దొర్లించేవాడు పాపం—

మూర్తి:-ఇప్పుడు ఆ కుటుంబానికి నిరాధారమై పోయిందిగదా!

స్వామి:-ముగ్గురు కొడుకులు - నల్గురు ఆడపిల్లలూ అంతా నత్తానామాను - వీళ్లగతిని గురించే విచారంగా వుంది—

మూర్తి:-నేను అతని శవాన్నైనా చూసిరావాలి. అఫీషియల్ గా అక్కడి సిట్యుయేశన్ చూడవలసిన అవసరం కూడా ఉంది — నేను వెడుతున్నాను.

స్వామి:-వెళ్ళిరామరి - చూడు - చాలా గోలగా ఉందంటున్నారు - చాలినంత బందోబస్తుతో వెళ్ళవలసి ఉంటుంది సుమా!

లలిత:-అవునూ!

మూర్తి : ఆఁ దానికేం ఫర్వాలేదు. (అని వెళ్ళాడు)

స్వామి : ఆ కుటుంబానికి ఇది అగ్నిపరీక్షా సమయం. ఇటువంటి అగ్ని పరీక్షలు ఎన్నో కుటుంబాలకు వస్తున్నాయి - తట్టుకున్నవాళ్ళు — తేరుకుంటున్నారు - లేనివాళ్ళు అగ్ని హోత్రానికే ఆహుతి అవుతున్నారు!

లలిత: "అయితే మామయ్యా! రావుగారి భార్యాపిల్లల గతి ఏమవుతుందో! పోనీ - మీరు వెళ్ళి వారిని మన ఇంటికి తీసుకొని రాకూడదా? మనకి దగ్గర బంధువులనికూడా" అన్నారు.

స్వామి: అయ్యో! వెర్రితల్లీ - మనం గవర్నమెంటు ఉద్యోగస్తులమమ్మా! అది మనకెలా సాధ్యపడుతుంది. పోనీ ఆ పెద్ద కూతురు పెద్ద పిల్లవాడూ చదువు పూర్తిచేశారుట. ఏదైనా గవర్నమెంటులో ఉద్యోగం యిప్పించటానికికూడా వీలులేని పరిస్థితి.

లలిత: అయిన వారికే అనాథులకీ రక్షణ యివ్వటం అపరాధ మవుతుందా?

స్వామి: అవునమ్మా! అపరాధమే - ప్రభుత్వ ప్రతికక్షులకి సానుభూతి చూపడంకూడా అపరాధంగానే యెంచుతారు.

లలిత: పోనీ రహస్యంగానైనా సహాయం చేయకూడదా ?

స్వామి: దానికేమి ! చెయ్యవచ్చు - ప్రభుత్వానికి తెలిస్తే మాత్రం చిక్కు తప్పదు.

లలిత: మీరు స్నానానికి లెండి. ఆయన వచ్చేటంత వరకూ నేనుంటాను.

స్వామి: (లేస్తూ) స్నానంలాగేవుంది బ్రతుకు-పద

(తెర)

చతుర్థాంకము ఐదవ రంగము

ప్రదేశము : కలెక్టరుగారి భవనం - స్వామి నాయుడుగది.

ప్రవేశము : (లలిత మామగారి మంచం దగ్గర కూర్చుని ఉంటుంది - మామగారు జబ్బుతో మంచంమీద పడుకొని ఉంటాడు - దగ్గుతూ ఉంటాడు.)

లలిత: మీకు ఆయాసం ఎక్కువగా ఉంది - ఇంకో మోతాదు యిస్తాను - పుచ్చుకుంటారా ?

స్వామినాయుడు:-(దగ్గుతూ) అమ్మా - మూర్తి యింకా రాలేదూ ?

లలిత:-వస్తారు - మీరు మందు పుచ్చుకోండి - డాక్టరుని దిగబెట్టి రావటానికి వెళ్ళారు-(మందు గ్లాసులోపోసి) ఇదిగో - మందు పుచ్చుకోండి !

స్వామి:-(త్రాగలేక ఉక్కిరి బిక్కిరి అవుతాడు.)

లలిత:-(కంగారుపడి) అప్పన్నా ! అప్పన్నా !

అప్పన్న:-(ప్రవేశించి) ఏమమ్మా !

లలిత:-తాతగారికి చాలా ప్రమాదంగావుంది - అయ్యగారు డాక్టరుతో ఇంటివరకూ సాగనంపటానికి వెళ్ళారు కాబోలు - నీవు సైకిలుమీద వెళ్ళి త్వరగా వచ్చేయమని చెప్పు రా !

అప్పన్న:-చిత్తం - (గబగబా వెళ్ళిపోతాడు.)

లలిత:-(మామగారి మంచం దగ్గరకువచ్చి) మామయ్యా-మామయ్యా (పలుకడు) అయ్యో పలుకటంలేదు-(కాళ్లూ చేతులూ పట్టుకు చూసి) కాళ్లూ చేతులూ కూడా చల్లగా ఉన్నాయి - ఆయన ఇంకా రాలేదు - (మళ్లీ గుమ్మం దగ్గరకి వెడుతుంది.)

మూర్తి:-(ప్రవేశించి) లలితా ! ఎలావుంది ?

లలిత:-కాళ్ళూ చేతులూ చల్లగా ఉన్నాయి డాక్టరు ఏమన్నాడు ?

మూర్తి:- (నిట్టూర్పువిడిచి) ఏమీలాభం లేదన్నాడు లలితా ! (మంచం దగ్గరకు వెళ్ళి) నాన్నా ! నాన్నా !

స్వామి:-వచ్చావా బాబూ - రా - దగ్గరగా - రా ఇలా - (ప్రక్కన కూర్చోమని సౌంజ్ఞ చేస్తాడు)

మూర్తి:-(గుడ్ల నీరు క్రమ్ముతుంది - డగ్గుత్తికతో) అల్లాగే - ఇక్కడేవున్నా - నాన్నా.

స్వామి:-అమ్మాయీ - శాంతా అని (కలవరిస్తాడు)

లలిత:-టెలిగ్రాము యిచ్చానన్నారు ఎప్పుడు అందుతుందీ - యేబండికి వస్తారు ?

మూర్తి:-ఎక్కడలాహోరు - ఎక్కడ మనం అందుతే మాత్రం - రెండు రోజులకిగాని రాలేరు-నాన్నా-శాంత అక్కయ్యని రమ్మని రాశాను - వస్తుంది-

స్వామి:-అమ్మాయీ - లలితా ! - చూడూ-నాకు-కాలం సమీపించిందీ - చాలా కష్టాలుపడి - ఇంతవాడిని చేసాను - ఇంతటిలో - నాన్నా (కొడుకుని కౌగలించుకొని) నీకు తల్లిఅయినా - తండ్రిఅయినా - లలితే సుమా - శాంతని - చూడాలని ఉంది - అబ్బా ... శాం ... తా ... (ప్రాణం విడుస్తాడు.)

లలిత:-అయ్యో ! అయ్యో ! మామయ్యా - మామయ్యా !

మూర్తి:-అయ్యో ! నాన్నా ! నాన్నా ! అయ్యో ! ఇంకెక్కడి నాన్న లలితా (దుఃఖిస్తాడు)

లలిత:-(ఏడుస్తూనే) ఊరుకోండి ! ఊరుకోండి !

మీరే అధైర్యపడితే - మనల్ని ఓదార్చేవారు ఎవరూ ?

మూర్తి:- అయ్యో - ఈ జన్మకింక అమ్మా నాన్నా కూడా లేకుండా అయిపోయింది గదా !

అప్పన్న:-(ప్రవేశించి) బాబూ !

మూర్తి:- అప్పన్నా ! తాతగారు వెళ్ళిపోయారు -

అప్పన్న:- అయ్యో బాబూ ఎంతపని జరిగిందండీ అని (ఏడుస్తాడు.)

మూర్తి:- అప్పన్నా — చూడూ - మిగతా ఏర్పాట్లు చేయించుమరీ(అని దుఃఖిస్తాడు)

అప్పన్న:- చిత్తం బాబూ

మూర్తి:- ఎవళ్లైనా - బ్రాహ్మలు ఆ ప్రక్క వీధిలో ఉంటారు -

దఫేదారు:- చిత్తం

డి. వై. ఎస్. పి. :-(ప్రవేశించి) సార్ ! యూ ఆర్ అండర్ యెరెష్టు (వారంటు చేతికిస్తాడు

(లలిత. మూర్తి నిర్ఘాంత పోతారు)

అప్పన్న:- ఏమయ్యా ! మతి ఉందా లేదా ? ఈ సమయం ఏంటి నీరావడం ఏంటి ? అయ్యగోరు వచ్చేవరకూ అవతల ఉండలేక పోయ్యావంటయ్యా !

డి. వై. ఎస్. పి. :- (శవంచూచి) ఓ ఐ యామ్ సారీ ...

అప్పన్న:- చాలు చాల్లే - సారీ అంట సారీ ఎవడైనా నవ్విపోతాడు - ఇంతట్లోకి ఏమి మునిగిందయ్యా! ఎకాయెకీని లోపలికే వచ్చావు? నడు - అవతలికి -

మూర్తి:- అప్పన్నా ! ఒక్క నిమిషంవుండు - ఇది విధి విలాసం ! అతని డ్యూటీని అతను చేస్తున్నాడు.

లలిత:- యుక్తాయుక్త వివేచనజ్ఞానం ఉండనక్కర్లేదా ? సమయాసమయాలు పాటించనక్కర్లేదా ?

డి. వై. ఎస్. పి. :- అమ్మా: మీరు నన్ను దూషించి ప్రయోజనంలేదు. డాక్టరురావు లాఠీచార్జీ చేసిన సందర్భంలో ఆసుపత్రిలో మరణించారు — అప్పుడు — ప్రజలుగలాటాచేయగా - కలెక్టరు ఫైరింగుకి ఆర్డర్స్ ఈయనిరాకరించారు — ఆనాడు దుండగులు హాస్పిటల్ యావత్తూ నాశనం చేసారు. — ఆ కేసులో వీరే బాధ్యులుగా ప్రభుత్వం భావించింది - రాజద్రోహియైన — డాక్టరురావు — భార్యా పిల్లలకు - వీరు ఆ నాటి లగాయతు నేటివరకూ - ఆశ్రయమిచ్చి పోషిస్తూన్నారుకూడా. ప్రభుత్వానికి తెలియవచ్చింది - తక్షణం యెరెష్టుచేసి తీసుకొని రమ్మన్నారు ఇందు నా దోషం ఏమీలేదని నమ్మండి.

మూర్తి:- Mr డి. వై. ఎస్. పి. ! అంతా నాకు తెలును - నీ డ్యూటీని నీవు నెరవేర్చుకోటానికి - నా అభ్యంతరంలేదు - జీవితంలో వచ్చిన ఈ పరిణామానికి - నేను మనఃపూర్వకంగా స్వాగతం యిస్తున్నాను. దేశసేవకీ — మానవసేవకీ భగవంతుడు ఈ నాటికైనా - నాకు అవకాశం యిచ్చినందుకు వేయి నమస్కారాలు చేస్తున్నాను-

లలిత:- వీరే కాదు . వారి భార్యనైన నేనూ రాజద్రోహాన్ని చేశాను - నన్నుకూడా యెరెష్టు చేయండి - (ఒక్క నిమిషం నిశ్శబ్దం)

మూర్తి:- లలితా - నేను వెడుతున్నాను-నీవు మిగతా అంత్యక్రియలు మా నాన్నగారికి చేయించు - (తండ్రి శవం సమీపించి) నాన్నా - కనిపెంచిన తండ్రికి కర్మైనా చేయలేకపోతున్నాను గదా ! (క్షణమాత్రం దుఃఖించి) భార్యవేపూ అప్పన్నవేపూ తండ్రిశవంవేపూ అశ్రుపూరిత నయనాలతో చూస్తూ వెళ్ళిపోతాడు.

లలిత<br>అప్పన్న } కన్నీరు కారుస్తూ - కొయ్యబొమ్మల్లాగ నిలబడిపోతారు.

(జాలిగా సంగీతం తారకస్థాయిని వినబడుతుంది.)

( తెర నెమ్మదిగా వ్రాలిపోతుంది)

(సశేషము)

# హిందూసంఘము - వివాహము

—(o)—

[మద్రాసుకు సమీపములోని తాంబరమునందు భక్తుల సమావేశములో కంచి కామకోటి పీఠాధిపతులు . జగద్గురు శ్రీ శంకరాచార్య స్వాములు ఉపన్యసిస్తూ హిందూసంఘమునందలి వైవాహిక వ్యవస్థను గురించి యీ క్రింది అభిప్రాయములను వెల్లడించారు. సంఘపురోభివృద్ధి, సంక్షేమంపట్ల ఆసక్తిగల అనుభవజ్ఞులు శ్రీ స్వాములవారి అభిప్రాయములను పరిశీలించి అనుకూల ప్రతికూలవాదములను క్లుప్తముగా వ్రాసి పంపినచో సంతోషముగా ప్రచురించెదము - సంపాదకుడు]

పది, యిరవై సంవత్సరములకు పూర్వము బాలికలలో 12, 13 ఏండ్ల వయస్సువారు అవివాహితులు అరుదు. కాని యిప్పుడు పరిస్థితులు మారినవి — 20, 30 ఏండ్ల వయస్సువారు సయితము వివాహము కాని బాలికలున్నారు. సదుద్దేశంతోనే బాల్య వివాహముల నరికట్టుటకని శారదాచట్టము అమలులోనికివచ్చియుండవచ్చును. కాని దాని ఫలితంగా సంఘంలో అనేక విషమ సమస్యలు ఉత్పన్నమైనవి. ఇవి బాలికలకు సకాలములో వివాహములు జరుగు కాలములో నుండునవి కావు.

పూర్వకాలమున హిందూకుటుంబంలో వితంతువు భారముగా కాక ఆస్తిగా ఎంచబడుచుండెడిది. ఆమె బాలబాలికల క్రమబద్ధమైన పెంపకమునకు తోడ్పడుచుండెడిది. పురాణేతిహాస జ్ఞానముకలదై ఆ కథలతో బాలబాలికలకు మంచిచెడ్డలకు సంబంధించిన జ్ఞానమును, బుద్ధివికాసమును కలిగించుచుండెడిది. ఆమె దివ్య జీవనానికి మార్గదర్శిగా నుండెడిది. ఆమె నియమ, సుశిక్షణాయుతమైన జీవయాత్ర కుటుంబములోని పిన్నలను, పెద్దలను తీర్చి దిద్దుచుండెను.

అనేకమంది బాలికలు అవివాహితులై దైన్యావస్థలో నుండగా వితంతు పునర్వివాహములను ప్రోత్సహించుట, దోహదముచేయుట చోద్యమనక తప్పదు. చట్టరీత్యా ద్విభర్త, ద్విభార్యా స్వీకరణ నిషేధిస్తూ హిందూ సంఘమునకే ఉద్దేశించబడినదికాని మన దేశపు ముస్లింవారుడు నలుగురు స్త్రీలను భార్యలుగా స్వీకరించడానికి 'సమాన హక్కులను, సమాన అవకాశములను' ప్రకటించిన రాజ్యాంగము ఒకే దేశంలో వసతికలిగించడము చాల విచారకరము.

ఇట్టి సాంఘిక సమస్యల పరిష్కారమునకు స్వయం సేవా సంఘములు ఏర్పడవలసియున్నవి. ఈ సంఘముల ప్రధాన ఉద్దేశము స్త్రీల దైన్యావస్థను గుర్తించి వారి నుద్ధరించుట అయియుండాలి. సేవాసదనం లాంటి సంస్థలు నిస్సహాయస్థితిలోని మహిళలను, విడనాడబడిన భార్యలను, అనాథలగు వితంతువులను, అవివాహితలగు బాలికలను ఉద్ధరించి పనిపాటులు కల్పించుటలాంటి సంఘసేవచేయుట కేర్పడినా, ఆ సహాయ కార్యకలాపములు సమస్యలను శాశ్వతంగా పరిష్కరించలేవు; అది కొంత తాత్కాలిక ఉపశమనమును మాత్రము కలిగించును. కాబట్టి సమస్యల శాశ్వత పరిష్కారమునకు మూల మార్గములనుచేపట్టి పూనుకొనవలెను. చెట్టునకు నీరు అడుగున పాదిలో పోయవలెను కాని పైభాగమున కాదు. మనము బాలికలకు సకాలములో వివాహమునకు పూనుకున్నచో సంఘములోని అనేక విషమ సమస్యలు పరిష్కారము కాగలవు; కొంత కాలమునకు క్రమముగా సేవాసదనం లాంటి సంస్థల అవసరముకూడ మరుగుపడిపోవును.

మన శాస్త్రముల ననుసరించి బాలునకు 8-వ ఏట ఉపనయనము చేయవలెను; బాలికకు ఎనిమిది, పన్నెండుఏండ్ల మధ్య వయస్సులో జరగవలెను. ఇందలి ఉద్దేశము ఏమన బాలలు కామోద్రేకములకు

గురికాకముందే క్రమబద్ధమైన సుశిక్షణ కలవాటు పడెదరు. తనకు భర్తే సర్వస్వమనియు, ఆరాధనీయుడనియు కామాంకురానికిముందే బాలిక గుర్తించినచో ఆమె వైవాహిక జీవితంలో కష్టసుఖాలను సమాన స్థాయిలో ఓర్పుతో ఎదుర్కొనగలదు. దానిలో పాటు ఆధ్యాత్మిక జీవితానికి సయితము పునాది ఏర్పడును. బాలురు సయితము యితర యూహాపోహాలకు గురికాకముందే గాయత్రీ మంత్ర అనుష్టానముల కలవాటుపడినచో భవిష్యత్ జీవయాత్రలో గాయత్రీదేవి అనుగ్రహమునకు పాత్రులయ్యెదరు.

భగవంతునికి జంకువాడే అన్ని విషయములను వాస్తవికత కనుగుణంగా చూడగలడు. భగవంతుని పట్ల భక్తి విశ్వాసముతే జీవితములోని ఒడిదుడుకులను నిబ్బరముగా నెదుర్కొనకలుగుటకు, అన్ని కష్టాలను, బాధలను, సహనము, వైరాగ్యముతో భరించుటకు శక్తిని సమకూర్చును. ఆశాపాశములతో ఆరాధించువాడు కొద్దిపాటి కష్టనష్టములను సయితము సహించలేడు. నిజమైన భక్తుడు తనకు ఏర్పడిన నష్టము గొప్పదైనా సహించి "భగవంతుడే యిచ్చాడు – ఆయనే దానిని మరల తీసికున్నాడు" అని తృప్తి పడును. సకాలంలో బాలికలకు వివాహము, బాలురకు ఉపనయనము చేయవలెనన్నెడి ఆసక్తి రానున్న తరములవారి కత్యంత అవసరము

తమ ఆడబిడ్డల మాన మర్యాదలను, భవిష్యత్తును కాపాడుట తల్లిదండ్రుల గురుతర మైన బాధ్యత. బాలికలకు సకాలములో వివాహమగుటకు సంఘము సయితము బాధ్యత వహించవలసి యున్నది. ఇదియే మనము మహిళా శ్రేయస్సుకు, సౌభాగ్యమునకు చేయగల ఉత్కృష్టమైనసేవ. మనము ప్రభుత్వ చట్టమును పాటించవలసియున్నను నిర్ణీతమయిన వయోపరిమితికిముందే వివాహ ప్రయత్నముల కుపక్రమించినచో గడువుదాటిన వెంటనే వివాహము చేయవచ్చును. తల్లిదండ్రులు తమ ఆడబిడ్డలపట్ల విధ్యుక్త ధర్మమును నెరవేర్చనిచో మితిలేని అపకారముచేసినవారగుదురు. కొందరు తమ బాలికలకు సకాలంలో వివాహముచేయగలరు. మరికొందరు ఆర్థికదుస్థితి వలన తమ బాలికలకు సకాలంలో వివాహ ప్రయత్నములు చేయలేకున్నారు. ఇట్టి నిస్సహాయ స్థితిలోని వారికి సహాయపడుటకు సేవాసంస్థల ఆవశ్యకత ఎంతైనను కలదు.

పురాణములు మనకు ధర్మోపదేశమునకు ఏర్పడినవి. పురాణ కథలలోని అసహజ వ్యక్తిత్వములు, సంఘటనలకంటె అందులోని మంచి చెడ్డలు ప్రధానములు. వాని నాధారంగా చేసికొని శాస్త్రముల ననుసరించి జీవితములను తీర్చి దిద్దుకొనుటకు అవి ఉపకరించును. మనము తాటిచెట్టు ప్రమాణపు మనిషి, మూడుతలల మనిషియునికి నమ్మజాలనంత మాత్రమున పురాణకథలు కల్పితములు, నమ్మజాలనివని చెప్పకూడదు. ఆధునిక యుగంలో పురావస్తు పరిశోధనల ద్వారా పురాణములయందలి విషయములకంటె చిత్ర విచిత్రములు బయటపడుచున్నవి. కాబట్టి పురాణములందలి విషయములు మనకు తెలియనిది సత్యదూరములనుటకు అవకాశములేదు. ధర్మాన్ని ప్రబోధించే పురాణములు శాశ్వతకాలం వినియోగపడగలవు.

— పున్నయ్య

—(౦)—




# త్వరపడి ఏపని చేయరాదు

ఓరుమల్ల భాస్కరరావు

రామప్రసాద్ ఒక జమీందారు బిడ్డ. అతనికి పుట్టినరోజు పండుగకు మామ ఒక మంచి కుక్కను బహుమతిగానిచ్చెను. అది టైగర్ అనే పేరుతో పెంచబడుచుండెను. రామప్రసాద్ వేటకు పోవునప్పుడు అతని వెంట వెళ్లుచుండెను. వేటాడు సమయమున ఆ కుక్కసింహమువలెను, ఇంటియందు విశ్వాసముగలదియై నెమ్మదిగా మెలగుచుండెడిది.

ఒకనాడు రామప్రసాద్ వేటకువెళ్లుచు టైగరును వెంటగొనిపోలేదు. కుక్క వెంటలేకపోవుటచే ఆ నాటి వేట ఉత్సాహకరముగా లేక పోగా రామప్రసాద్ త్వరగా యింటికి తిరుగుమొగముపట్టెను. టైగరు రామప్రసాద్‌కు కొంతదూరము ఎదురేగగా దాని నోటరక్తము, దారిపొడుగునా గల రక్తముమరకలు అతడు చూచి భయభ్రాంతుడయ్యెను. త్వరత్వరగా యింట్లోకి వెళ్లి ఊయలలో తన తమ్ముని కొరకై చూచెను. అక్కడ పసిపిల్లవాడు లేకపోగా చుట్టూ యున్న రక్తపుమరకలను చూచి కుక్కయేఅతనిని చంపియుండునని దుఃఖోద్రేకముతో కుక్కను ఒక కర్రతో కొట్టిచంపెను. ఇంతలో తల్లిదండ్రులువచ్చి టైగరు పిల్లవాడిని తోడేలు బారినుండి పోరాడిరక్షించినదని చెప్పి దొడ్లోని తోడేలు శవమును చూపించి, తొందరపడి కుక్కను చంపినందుకు అందరు చాల విచారపడిరి. రామప్రసాద్ తన పొరబాటుకు వెక్కివెక్కి ఏడ్వసాగెను. ఆకుక్కశవానికి వాళ్ల భవన ఆవరణలోనే సమాధి నిర్మింపచేయబడెను. రామప్రసాద్ ప్రతిదినము కొంతసేపు ఆ సమాధి దగ్గర టైగరునుతలచుకొని కాలం గడుపడం అలవాటయింది.

కాబట్టి ఏపనినైన త్వరపడి చేయతగదు. (170-వ పేజి చూడుడు)

విజ్ఞాన ముక్తాలు

# శ్రీ సాయిబాబా ప్రవచనములు



మూలం :
శ్రీ స్వామి కేశవయ్యజీ

అనుసరణ :
శ్రీ సి. సి. పున్నయ్య

(గత సంచిక తరువాయి)

'పరిపూర్ణమైన భక్తి విశ్వాసములతో నాకు ఏది ఎంత కొద్దిగా నివేదించినను నేను స్వీకరించుటకు తయారుగా నుందును. కాని గర్వముతో అహంకార పూరితముగా నాకు ప్రపంచమునే నివేదించినను నేను దానిని స్వీకరించ నిరాకరించెదను. నేను ఆశించునది ప్రేమ కాని వస్తువు కాదు అని గమనించవలెను. నేను అందరి దగ్గరనుండి స్వీకరించ నంగీకరించను. నేను స్వీకరించినదానికి నూరు రెట్లు నేనీయవలసియున్నది.'

అంతిమ లక్ష్యమైన ముక్తి సాఫల్యమునకు ధ్యానపద్ధతి చాల ముఖ్యమైనది. నిర్మలము, నిశ్చలమైన ధ్యానమువలన మన యూహలు ప్రశాంతమై ఏకోన్ముఖము కాగలవు. నిష్కామిగా, దృఢనిశ్చయముతో సర్వాంతర్యామియైన భగవంతుని ధ్యానించవలెను. నిరాకారుడైన భగవంతుని దృష్టిలో నుంచుకొని ధ్యానించలేనప్పుడు గురువును దృష్టిలో నుంచుకొని ధ్యానమును కొనసాగించవలెను. తాబేలు తన బిడ్డలను చూడగనే ఆహారమిడును. గురువు దృష్టి మీ యొక్క జీవిత సౌభాగ్యమునకు అమృత తుల్యమైనది. గురువుయొక్క అనుగ్రహ కటాక్షములు మీకు ఆనందాన్ని, శాంతిని, సంసారబంధములనుండి విముక్తిని సమకూర్చి పరిపూర్ణమైన ఆత్మానందాన్ని సమకూర్చును. దీనిని మీరు అనుభవించి మాధుర్యమును రుచిచూడనగును.

దప్పిగొన్నవారికి దాహమిండు! ఆకలిగొన్నవారికి ఆహారమిడుడు! దిగంబరులుగా నున్నవారికి దుస్తులనిండు! వ్యాధిగ్రస్తులకు, అనాథలకు మీరు చేయగల సహాయము చేయుడు! సహాయమునకొరకు మీ కడకు వచ్చినవారిపై రంకెలు వేయకుడు! అట్టివారిని సానుభూతి దయలతో ఆదరించుడు! అట్టివారిలో 'హరి'ని చూడుడు! భగవంతుడు మన ఏకైక రక్షకుడు. భగవంతుని కార్యక్రమము మన యూహ కందనిది, అద్భుతమైనదీను. భగవత్సంకల్పమునకు విధేయులుకండి! మనము ప్రతిజీవిలోను భగవంతుని చూడకలిగినచో ఆయన సంకల్పము సిద్ధించి తప్పకుండా భగవదనుగ్రహము మనకు సిద్ధించును.

శ్రీ సాయిబాబా నివసించిన షిర్డిలోని మసీదు ద్వారకామాయి మీ తల్లి. నీవు అందులో ప్రవేశించి కూర్చున్నచో నీ మనసులోని కలతలు, బాధలు, కష్టాలు, ఆపదలు నివారణమగును, 'తల్లి

తన బిడ్డలపట్ల అత్యంత ప్రేమానురాగాలు కలది.' తల్లి తొడపై విశ్రమించుటకు ఉత్సహించు బిడ్డ ఎల్లప్పుడు పరిపూర్ణ ఆత్మానందమును పొందును.

ఇతరులకు పెట్టక నీవు మాత్రము ఒంటరిగా ఆహారమును సేవించు దురలవాటును విడనాడుము. మీరు భుజించుటకు ముందు భగవంతుని తలచి నివేదించి దేనినైనను స్వీకరింపుడు! నిర్మాతకు నివేదించకుండా తనకు లభించిన అవకాశములను స్వీకరించువాడు పాపి.

“మీరు చూస్తున్న అయిదడుగుల జీవిని కాదు నేను. నా దేహము అంతరించినను, సమాధిలోని నా ఎముకలు చురుకైనవిగా నుండును. నేనే కాదు. నా సమాధి సయితము మాట్లాడుతూ ఓదార్చి, నన్ను రక్షకుడుగా నమ్మినవారిని ఉత్సాహపరచి సంతోషపరచును. నేనిది సత్యవాక్కుగా చెప్పుచున్నాను. నన్ను నమ్మండి! నేను మానవ రూపంలో మీతో లేకున్నను నేనెల్లప్పుడు మీతోనే యుందును.”

భగవంతుడు ఓర్పుతో దృఢవిశ్వాసముకలిగి యున్నవారిని రక్షించి కాపాడును.

‘విష్ణు సహస్ర నామము’ను తీసికొని చదువుడు! దీనిని మీకు బహుమానముగా నిచ్చుచున్నాను. నేనొకప్పుడు అమితముగా బాధపడుచు, యీ పుస్తకమును నా హృదయమునకు చేరువగా నుంచుకొంటిని. దానివలన నా బాధ ఉపశమించిన విధమును వర్ణనాతీతము. అది మన కష్టాలకు, బాధలకు దివ్య ఔషధములాంటిది. దానిని సద్భక్తితో, ప్రేమతో పఠించినయెడల మీకు శుభము కలుగును.

మనం ‘అహం’ను చంపుకోకుండాను, నిర్మలమైన బుద్ధి లేకుండాను, ఆశాపాశములకు పరిమితి లేకుండాను పవిత్ర గ్రంథములను పఠించికూడ ఫలితము శూన్యము. సద్భక్తుడు బంధముల కతీతుడై అన్ని జీవరాసులను సమాన దృష్టితో చూడవలెను.

“నేనెప్పుడు నా వాగ్దానములను భంగముచేయను. నా మాటను నిలుపుకొందును. అందుకుగాను నా ప్రాణమును సయితము త్యాగము చేసెదను.”

ఆత్మార్పణమనగా సాష్టాంగ దండప్రణామములు చేయుట, గురువుకు పరిచర్యలు చేసి సేవించుట మాత్రము కాదు. ఆత్మార్పణమనగా తన దేహము గురువునకు స్వంతమనియు, అది ఆయనను సేవించుటకే ఏర్పడినదను నమ్మకముతో సర్వము దేహము, బుద్ధితోసహా అర్పించుట. అట్టి ఆత్మార్పణము అహంకు అతీతమై చిత్తశుద్ధితో కూడిన ప్రేమ, భక్తితో కూడినదై త్వరగా బ్రహ్మజ్ఞానము పొందుటకు మార్గమగును. అదియే పరిపూర్ణ ఆత్మానందమునకు, కైవల్యపదవి సాధనకు కీలకము. గురువుయొక్క అనుగ్రహమువలన భక్తుని ఆధ్యాత్మిక దృక్పథములోని అజ్ఞానముతొలగి ఆత్మపరమాత్మ జ్ఞానము పెంపొందును. యదార్థమునకు సద్గురువు నిర్గుణ, సత్, చిదానందుడు. శిష్యుడు సయితము గురువు స్వభావము కలిగినవాడు. అయితే అజ్ఞానము వలన శిష్యుడు అనేక జన్మలెత్తినను సత్యమును గ్రహించలేకున్నాడు. గురువుయొక్క కరుణాకటాక్షములు కనీసము అతనిమీద ప్రసరించినచో కారుమబ్బులలాంటి అజ్ఞానము తేలిపోయి దేదీప్యమానముగా, స్వచ్ఛంగా ఆత్మ పరమాత్మ జ్ఞానము ప్రకాశించును. జ్ఞాన, భక్తి మార్గములు ముక్తి సాధనకు దారితీయును.

జ్ఞానమార్గము రామాఫలము; భక్తిమార్గము సీతాఫలము. సీతాఫలములోని గుజ్జు పైనేయుండి సులభముగా సేవించనగునది. అయితే రామాఫలంలోని గుజ్జు లోపలగానుండి అంత సులభముగా తినవగునది కాదు.

‘వృధా విమర్శలు చేస్తూ, దుష్ప్రచారము చేయువారు నన్ను గాయపరతురు. అయితే వానినన్నిటిని ఓర్పుతో భరించి ధైర్యము వహించువారు నాకత్యంత ప్రియతములు. మీకు నా ఆశీస్సులు

కావలసియున్నచో మానసికంగా నైతము యితరులను గాయపరచకుడు!

నన్ను కనుగొనుటకు దూరము వెళ్ళనవసరము లేదు. మీలో నేనెల్లప్పుడు ఉందును. నీ ఆకారమును, పేరును మరచిపొమ్ము. మిగిలియున్న నీలోని పరిశుద్ధ ఆత్మయే నేను. నీలోను, యితర జీవరాసుల లోను నన్ను చూడుము. నన్నలా ప్రేమించి ధ్యానించువాడు నా దగ్గరకు వచ్చును. ఇది సత్యము. నిజానికి అతడు నేనే. నన్నెల్లప్పుడు ప్రేమించు వానికి నేను లేని లోకము యెడారి మయము. కాబట్టి నీ మేలుకొరకు రాగద్వేషములకు మూలకారణమయిన అహంకార మమకారములను విడనాడి నీ హృదయములో ఆసీనుడనైయున్నట్టియు, ప్రతి జీవిలోను ఆశీనుడనైయున్నట్టియు నన్ను చూడుము! నిన్ను భగవంతుడనుగ్రహించుగాక!

---

అమ్మాయి:-అమ్మా! నాన్నగారు సినిమాకురారట. మనంమెలాగ వెళ్ళడం?
తల్లి:-పోనీ – ఆయన రాకపోతేపోనీ–సినిమాహాలువరకు మనలను వెంటబెట్టుకొనిపోయి, ఆట అయిపోగానే వచ్చి వెంటబెట్టుకొని రమ్మను.

యం. వి. రమణమ్మ

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(డిసంబరు సంచిక తరువాయి)

౩౨

ఇందీవరాక్ష! నీ సుందర గాత్రంబుఁ
బోలు దేహముగల్గు పురుషులెవరు
ముల్లోకములలేరు; మురహర! కమలాక్ష!
శ్రీ ధనురాణముల్ – చేతియందుఁ
బ్రీతిఁ దాల్చితివీవు; విస్తీర్ణ వక్షస్థ
లముగల్గి, వివిధ రత్నములచేతఁ
బొలుపారెడి విచిత్రభూషణ తతులచేఁ
జెలువారుచున్నావు; శ్రీ శుభాంగ!
రామ! ఆజాను బాహుండవై, మనోహ
రాస్యమును కల్గినావు; శోణాంఘ్రిపద్మ
ములతో, నీలమేఘశ్యామ! మోదమలరఁ
గులుకుచున్నావు; శ్రీపతీ! గొను నమస్సు.

౩౩

అలరారుచుండు, దివ్యారణ్యమందు, 'య
తీంద్ర' పట్టణమొందు తేజరిల్లు
షడునారువేలు సువరపు స్తంభముల్
గల్గు మంటపమందు గ్రాలుచుండు
మందార వృక్షంబు-మధ్యమందుండు; నా
నా రత్న ఖచితమౌ – నాణ్యమైన
సింహాసనంబందు చెలువారు; దానిపై
సంస్థితుండైనావు; జానకియును
లక్ష్మణుండు, నీ సేవల – లలితభక్తి
సేయుచున్నారు; శ్రీరామ! చిద్విలాస!
పూతచారిత్ర! సీతా సమేత! నిన్ను
భజనచేసెద సతతంబు – విజయమిమ్ము;

౩౪

ముక్కంటిభార్యయై – ముక్తినిచ్చునదియై
భగవత్స్వరూపయై – బరగనెద్ది?
సారస్వతియయి, భగీరథు కూతురై
మందాకినీ నామమొందెనెద్ది?
లోక కిల్బిషములఁ బోకార్చి, సురనది
యై, పావనంబైన యట్టిదెద్ది?
ఇందు శాంతిప్రభనొంది, లోకమునందు
కీర్తికరంబయి, గెరలునెద్ది?
అట్టి గంగ పాదములందు, బుట్టినే మ
హాత్మునకు? విష్ణురూపుఁడై యలరు నెవఁడు?
అట్టి రఘువీరు శ్రీరాము ననఘచరితు
నాశ్రయించి, సేవించెద నహరహంబు

౩౫

ఏపాదధూళిచే – శాపవిమోచన
మందినదానా దహల్యకాంత!
మూడులోకంబులవీడ నడంచెడు
శ్రీ నామమెయ్యది చింతసలుప

పూర్ణచంద్రునివంటి-పోలుపారు, మందహా
సములతోడ దీపించు సగసుఁడెవఁడు ?
పద్మనేత్రములతో, పరమపావనుఁడౌచు
తేజస్స్వరూపుఁడౌ - ధీరుఁడెవఁడు ?

అట్టి రఘువంశ దీపకుండమలచరితుఁ
డార్యుఁడుర్వీజనాథుఁ డహరహము, కరు
ణాంత రంగుడై మముబ్రోచు-సంతసమున
నతని చింతింతు, సేవింతు ; మతిఁదలంతు.

౩౬

కరకంకణంబులు, గాలికడియములు
భుజకీర్తులనుగల్గి - పొలుపుగాగ
మాణిక్యకుండల మండితుండై, హార
ములు, గొప్ప భూషణములు, సహస్ర
ములతోడ ముద్దుగాఁ గులుకుచున్నాఁడవు
శ్రీరామ ! రఘురామ ! శ్రీ శుభాంగ!
రత్నప్రభలతోడ రాజిల్లు నీ హస్త
ములు, జానకీ స్తనములను మోద

మలరదాక, గగుర్పాటు లావహించె
సీత చిఱునవ్వుతోడఁ గాంచెను; ముకుంద!
వరద! రఘువంశ శ్రేష్ఠుఁడా! భక్తసులభ!
గుణనిధీ! నిన్ను సేవింతు ; కుతుకమలర

౩౭

కోటి మన్మథ తేజ! కువలయశ్యామ! శ్రీ
రామ! సీతాపతీ! రమ్యతేజ!
పూర్ణచంద్రాస్య! సొంపులుగుల్కు నవనీత
కోమలదేహ! యక్రూరవరద!
కౌసల్యకులభూషణా! సత్యచరిత! శృం
గారలోల! ముకుంద! కాంతసీత
స్తన యుగ్మమందు, రత్నప్రభల్ జిమ్మెడి
మణిహార పంక్తుల మధ్య నీవు

రామ! వెలుగొందుచున్నావు రమ్యఫణితి
నీదు శృంగారచేష్ట వర్ణింపఁదరమె!
జానకీనాథ! రఘువరా! సరసిజాక్ష!
సంస్తుతించెద ; దుఃఖముల్ సంహరింపు.

౩౮

అవని జా స్తన కుంకుమాంకితంబైనట్టి
గొప్ప వక్షస్థల మొప్పె నీకు
వందారు మందార! బృందారకస్తోత్ర!
సుందర శుభగాత్ర! శుభ్ర తేజ!
జానకీప్రియ! ఘనచ్ఛాయ నీలశరీర!
భూషణ తతులచే మోదమంది
వామభాగంబున - భూమాత సుత, కూరు
చుండంగ, ముదమున నొప్పినావు ;

ఉపనిషత్తులెప్పు డుజ్జ్వలంబుగ నిన్ను
స్తోత్ర మొనరసల్పు - శుభ్ర తేజ!
నీదు సామ్యమెవరు నిక్కంబుగాలేరు
నీదు సేవసేతు - నీరజాక్ష!

(సశేషము)

# 'పాపం బ్రద్దలైంది'



'రాఘవ'

(గతసంచిక తరువాయి)

"పిల్లలు గల్గలేదని దేవాలయం కట్టిద్దామను కొంటున్నాను. వూళ్లన్నీ తిరుగుతూ చందాలు పోగుచేస్తున్నాను. అందువల్ల మనిషిని యిలా చిక్కిపోయాను. నువ్వుకూడా ఎంతో అంతయిస్తే బాగుంటుందని వచ్చాను." - అని నిర్భయంగా అబద్ధమాడేశాడు. తనవద్ద యిలా అబద్ధమాడతా డని జగన్నాథం యెట్లా తెలుస్తాడూ! వెంటనే ఒక వెయ్యిరూపాయలు, తెచ్చి యిచ్చాడు. అందు కొని నారాయణరావు ఆ సాయంత్రానికే యింటి కొచ్చాడు.

ఆ నాడు దుర్గమ్మ - ధర్మారావూ జగన్నాథంను అనేకవిధాలుగా దూసిపోశారు. ఉన్న వేయి రూపాయలను ఆ రాత్రి భద్రంచేసి, తెల్లారటం తోనే, కొన్ని బాకీలు తీర్చేశాడు. ఉన్న అయి దెకరాల్లో మూడు ఏకరాలకు బేరంపెట్టాడు. తూర్పువేపు గడ్డివాముల దొడ్డిని అమ్మివేశాడు. వూరిమధ్య పెద్ద దేవాలయాన్ని కట్టేందుకు, వూరి వార్ని సంప్రదించాడు. నిజంగా కడతాడో, లేదో నని కొందరు పెదవులు విరిచారు. నమ్మకంవున్న వాళ్లు ఓపాన శక్తిగా ధన సహాయం చేసారు. నారా యణరావు ఒక్కవారం రోజుల్లో పనివాళ్లని పిల్చు కొచ్చి, దేవాలయానికి కావలసిన ఏర్పాట్లను చేయించసాగాడు. కూలీలు పునాదులు తీయ నారం భించారు. కొందరు రైతులు బళ్లని సాయంచేసి, రాయి తోలిస్తున్నారు. బేరం పెట్టిన మూడెకరాల్ని ఆరువేల కమ్మేశాడు. తాలూకాఫీసులో కట్టవల సిన పైకం కట్టేసాడు. యింత మార్పు నారాయణ రావులో తనకు తెలియకుండా ఎలా వచ్చిందోనని వీరభద్రం నెలరోజులపాటు దిక్కుతోచకుండా ఆలోచించాడు. శారద తిన్న దెబ్బలు మర్చే పోయింది. తన కడుపు పండటంకోసమే, భర్త దేవాలయం కట్టిస్తున్నాడని వుత్సాహపడింది. చేతులో చాలీ చాలకుండా డబ్బువున్నా, నారా యణరావు, అన్నగారికి చెప్పిన అసత్య ప్రకారం దేవాలయం కట్టించడానికి ధైర్యంతో పూను కొన్నాడు. ఆ పనిమీదే అతనెక్కువగా తిరుగు తున్నాడు. యింటిపట్టున క్షణంకూడా వుండటం లేదు. పేర్ల పంజాయాన తగ్గలేదు. జూదం అడపా. తడపా ఆడుతూనే వున్నాడు.

ఇలా వుంటూండగా, ఒకసారి, నారాయణరావు గ్రామాంతరం వెళ్ళాడు. ఆ సంగతి శారదకు తెలి యక, మునుపటికన్నా ఎక్కువ వుత్సాహంతో వుండటంతో, అతనికోసం, మామూలుగా ముస్తా బైంది. నారాయణరావు దేవాలయం విషయంలో, తీరికలేకుండా తిరగటంతో, వీరభద్రం, శారదను వెంటాడటం మొదలెట్టాడు. ఆమె ఎక్కడుంటే, అతనక్కడ వుంటూ వుండేవాడు. అన్నం వండు తూంటే, ఆ మాటా - యీ మాటా చెబుతూ, వంటింట్లోనే వుండేవాడు. దొడ్లో పనిపాటలు చేసు కొంటుంటే, తానూ సాయపడేలాగా, కల్పించుకొని చేయబోయేవాడు. పనివున్నా, లేకపోయినా, శార దను పలకరిస్తూండేవాడు. ఆ పుస్తకం చదివావా? ఆ కథ ఎట్లావుంది? రావూరి కథ ఎట్లావుందో చెప్పు? చాడీశ్వరికేవి, అదదైనా భలేగా వ్రాస్తుంది! 'చలం' మైదానం నీకు నచ్చిందా? యిలాంటి వెధవ ప్రశ్నలు అడుగుతూ, ఆమెను విసి గిస్తూ వెంటాడేవాడు. ఆమె లోగడ తిన్న దెబ్బల్ని గుర్తుచేసుకొంటూ, అతన్నేమీ అనేదికాదు. అందు వల్ల వీరభద్రం ఆమెను మరింత విసిగించేవాడు.

ఆ నాడు, నారాయణరావులేదని తెలియటంతో

వీరభద్రం శారదను ఎలాగైనా పొందాలనుకున్నాడు. బడిపిల్లలుంటే, తన ప్రయత్నం కుంటుపడుతుందేమోనని, ఎంచి, గబగబ పాఠాలు చెప్పేసి, మధ్యాహ్నం బడిలేదని చెప్పి పంపివేశాడు. వాళ్లు చంకలు కొట్టుకొంటూ వెళ్ళిపోయారు.

అవి చీకటి రోజులు. పాపానికి అనువైన సమయాలు. రాత్రికి భర్త వస్తాడేమోనని, మరింతగా ముస్తాబైంది. ఎదురు తెన్నులు చూసింది. నారాయణరావు రాలేదు. వీరభద్రం భోంచేసాడు. శారదకూడా తిన్నది. వెంటనే వంటిల్లు సర్ది వేసింది. వీరభద్రం మామూలుగా తన వాటాలోకి వెళ్ళి పడుకున్నట్లే పడుకున్నాడు. అలవాటు ప్రకారం యిల్లంతా సర్దుకొని, మధ్య వసారాలో పరుపువేసుకొని పడుకొంది. నిద్రపట్టింది. వూరు వూరుకునే వుంది. చెరిసగం రాత్రి గడిచింది.

ఎవరో తన మంచంచుట్టూ తిరుగుతున్నట్లు లీలగా తోచింది. కళ్ళు మగతనిద్రవల్ల తెరపిన బడటంలేదు. అయినా, కళ్ళు తెరచి చూసింది. వెలిగించి, గోడకి తగిలించిన చిమ్నీ ఆరిపోయింది. చిమ్మచీకటి. సుడిసి, సుడిసి గాలి వీస్తోంది. ఎవ్వరూ ఆ చీకట్లో వున్నట్టుగా కనిపించటంలేదు. భ్రమపడుతున్నానేమోనని, శారద మళ్ళా కళ్ళు మూసుకొని, పక్కకి తిరిగిపడుకొంది. - కాస్సేపు నిశ్శబ్దం .. వీరభద్రం నిలబడేవున్నాడు .. అతని శరీరం వేడెక్కుతోంది. తాళుకోలేకపోయాడు ... కదిలి, మంచంవద్దచేరి, కిర్రుమనిపించాడు ... గాజులు పగిలినయి ... మంచం క్రూరంగా చప్పుడు అవుతోంది ... ఆమె బాధగా మూల్గుతోంది. మంచంక్రింద మంచి నీళ్ళ గ్లాసు కర్కశంగా మోగింది ... తల్లోని సన్నజాజిపూలు నలిగి నలిగి, వాడిపోయినయి. రేకులు రాలినయి. పక్క దుప్పటి ఉండచుట్టుకొనిపోయింది. చీకట్లో, వాళ్ళిద్దరి పాపం బద్ధలైంది. - ఆమె వగర్చింది. అతను తూలుతూ వెళ్ళి, తన మంచంమీద కూలిపోయాడు. ఎవరికీ, యీ ప్రపంచం దృష్టి అప్పట్లో పట్టినట్టులేదు. తను, పాపంచేసానని, ఎవ్వరూ ఆ సమయంలో తల్చుకోలేదు. శారదకు అతణ్ణి తిట్టడానికి మాటలురాలేదు. కొట్టడానికి, గిచ్చటానికి, చేతులు లేవలేదు. అతను తన వేడిరక్తాన్ని - కోరికనీ, ఆమె చలవవల్ల తీర్చుకొన్నాడు. శారద వివశురాలై బలహీనంగావుంది .. తెల్లారేవరకూ, వాళ్ళిద్దరి పాపం ఆ యింట్లో తిరుగాడుతూనేవుంది .. యిరువురూ నారాయణరావుని మోసంచేసారు.

రోజులు గడుస్తున్నకొద్దీ శారద చిక్కిపోవటం మొదలెట్టింది. మనిషి నలిగిపోతూవుంది. తలకట్టు రాలిపోతోంది. క్రొత్తరూపమేదో నారాయణరావుకి శారదలో కనిపిస్తోంది. తీనిపోని వాంఛలు ఆమెలో కల్గుతున్నయి. దేవాలయం గోడలు నానాటికీ లేస్తున్నయి. శారద హృదయంలో తీయని కోరికలు వూరుతున్నయి. వీరభద్రం, నారాయణరావుతో అవసరముంటేనే మాట్లాడుతున్నాడు. సొంతవంట చేసుకోవటం ప్రారంభించాడు. ఎందుకైనా మంచిదని ఎడఎడంగానే వుంటూ వస్తున్నాడు. భగవంతుని దయవల్ల, పాపమో, పుణ్యమో, శారద మడిగట్టుకొంది. యీ విషయం నారాయణరావుకేం తెలుసు? ఒకసారి డాక్టరుకి చూపించి, శారద పరిస్థితిని తెలియజేసాడు. అతను, ఆమెను పరీక్షించి, చిరునవ్వుతో, దగ్గరకొచ్చి—

"దేవాలయం కట్టిస్తున్నందుకు, దేవుడు దయదల్చాడు .. మీ పుణ్యం పండింది. మీ యావిడ గర్భిణీ స్త్రీ." యింకా ఏమిటో చెప్పాడు. యిక నారాయణరావు, వినలేకపోయాడు. పుట్టిన సంతోషంలో, గబగబ, భార్యతో సహా యింటికొచ్చేశాడు. కొన్నాళ్లకి సీమంతం చేసుకొంది శారద. అప్పణ్ణుంచి ఆ నోటానోట, శారద కడుపుతో వుందన్నవార్త, బంధువులందరికీ తెలిసింది. జగన్నాథం నమ్మలేక నీమ్మాడు. దుర్గమ్మ - ధర్మారావులు నమ్మకపోగా, చెవులు కొరుక్కున్నారు. జయలక్ష్మి ముచ్చటపడింది. యిక ఆ నాటినుండి, నారాయణరావు, చేసిన అప్పుల్ని తీర్చటంకోసం అన్నగారివద్దకు అడపా - తడపాపోయి, డబ్బు తెస్తూండేవాడు. అతను ఏ అభ్యంతరమూ పెట్ట

పండాక, తన స్వార్జితాస్తి తాలూకు డబ్బుని, తమ్ముడికిస్తూండేవాడు, నారాయణరావు తెస్తూండేవాడు. యీ రకమైన చర్యలు - సహాయాలూ - దుర్గమ్మకు నచ్చలేదు. భర్తనీ, మరిదినీ తెగతిట్టిపోస్తూండేది. తనవల్ల అన్నగారికి, యింట్లో మాటలు పడాల్సొస్తోందే అని భావించినా, అడక్క తప్పటం లేదు.. క్రమేపీ, నారాయణరావు స్వయంగా వెళ్ళటం మానుకొని, వూరుకొన్నాడు. కొన్ని అప్పులు తీరినై. చివరకు, దేవాలయానికి డబ్బు చాలలేదు. వున్న యిల్లమ్మివేశాడు. వీరభద్రం బడి, మరో యింట్లోకి మారిపోయింది. నారాయణరావు దంపతులు వేరే యిల్లు అద్దెకు తీసుకొన్నారు. దేవాలయంకోసం, ఎంతో కష్టపడుతున్నాడు. యింతలో ఒకనాడు శారద ప్రసవించింది. మొగపిల్లవాడు. జగన్నాథం మురిసిపోతూ బారసాలకొచ్చాడు. యిక ఎవ్వరూ రాలేదు. దేవాలయం పూర్తికాలేదు. వూళ్ళో ఎవ్వరూ ధనసహాయం చేయటంలేదు. రోజులు గడ్డుగా గడుస్తున్నయి. అన్నగార్ని యిక సహాయంకోరటం భావ్యంకాదనుకున్నాడు. అప్పటికే దుర్గమ్మవల్ల, నారాయణరావు, బంధుకోటిలో తేలికపడ్డాడు. క్రమక్రమంగా మాట పట్టింపులొచ్చాయి. శుభాశుభాలకు యిరుకుటుంబాలవాళ్ళూ కలుసుకోవటం మానుకున్నారు. నారాయణరావు మూలంగానే, తన సంసారం గుల్లయిపోతోందని దుర్గమ్మ, ప్రచారం సాగించింది. ధర్మారావు, నా రా య ణ రా వు ని మోసగాడిక్రిందనూ, పాపాత్ముడిక్రిందనూ జమకట్టేసాడు. యికటువంటప్పుడు నారాయణ సంసారానికీ, జగన్నాథం సంసారానికీ, రాకపోకలెట్లా వుంటయి? మంచీ - మర్యాదెలావుంటయి? చేతిలో డబ్బు ఖర్చయిపోవటంతో, నారాయణరావు, దేవాలయం నిర్మాణాన్ని కొంతకాలంవరకూ ఆపుచేయించాడు. వీరభద్రం వీలుంటే నారాయణరావునీ శారదనీ, ఆపసిగండునీ చూడటానికి వస్తున్నాడు. లేనప్పుడు లేదు. వచ్చినప్పుడు మాత్రం ఆ పసిగండుని చూసి, వీరభద్రం ఎంతో సిగ్గుపడినట్లుగా నటించేవాడు. శారద ముఖంచూపేదిగాదు. చేసింది ఘోరపాపమని తెలుసు. కాని, కడుపుపండటంతో, ఆపాపాన్నేదో, మమకారం కప్పివేస్తూండేది. చీకటి పాపం మనస్సులో తల్చుకున్నప్పుడల్లా, నారాయణరావుని, నిజంగా మోసంచేసాననే ఏడ్చేది. కాని, పసివాడు అమాయకంగా నవ్వుతుంటే, ఆ పాపం హృదయంలో విడిలిపోతూండేది. ఒక ప్రక్క బాధ. మరో ప్రక్క ఆనందం. అనుభవించింది చీకటి పాపం. కళ్ళెదుట అనుభవిస్తున్నది, తరతరాలవరకూ చెరిగిపోని సంతోషం... శారద అంతగా బాధపడేదిగాదు. "తనూ ఒక సంతానవంతురాలైంది" అదే ఆమె తృప్తి. దానివెనుక వున్న క్రీనీడలు_చీకటి-పాపం - నరకం - బాధ - యిలాంటి వేవీ వున్నట్లు భావించేదిగాదు.

మూడుసంవత్సరాలు, ఒడుదుడుకులతో నారాయణరావు తన సంసారాన్ని, అతికష్టంలో నెట్టుకొచ్చాడు. పసికొడుకు మాటలు చెప్పటం నేర్చుకున్నాడు. 'అమ్మ - నాన్న' అనటంవచ్చినయి. అన్నప్రాశన చేశారా దంపతులు. నారాయణరావు, తన తండ్రి పేరుని, కుమారుడికి పెట్టాడు. జగన్నాథం సంతోషిస్తూ, రహస్యంగా ఒకవందరూపాయలు పంపుతూ - "రామకృష్ణుడికి నా ఆశీస్సులు. వాడికి నా ముద్దులు" అంటూ వుత్తరంవ్రాసాడు. ఆ డబ్బుతో కుర్రవాడికి, రెండు చేతులికీ మురుగులు చేయించాడు. మెళ్ళోసన్నని గొలుసువేసాడు. ఆ కుటుంబానికీ - తనకీ ఎంత విరోధంవున్నప్పటికీ, ఎన్నికత్తులు లేగినప్పటికీ ఎంత పగరగిలివున్నప్పటికీ, అన్నగార్ని పూజిస్తూనేవున్నాడు. జగన్నాథం యింకా, నారాయణరావుకి సాయపడటం, దుర్గమ్మతరపువారు ఓర్చలేకపోయారు. ఏలాగైనా సరే, నారాయణరావుని హింసపెట్టాలని ఎత్తుగడలు వేసీ, ఓడిపోయారు. జగన్నాథం అండ వున్నంతకాలం, నారాయణరావుకేమీ ఫరవాలేదని వాళ్ళు చివరకు తేల్చుకొన్నారు.

ఆ సంవత్సరం పంటలు సరిగా పండలేదు. వున్న రెండెకరాలు కలిపితే, ఏటా పండేకన్నా తరుగే

పంట పండింది. దేవాలయం పనులన్నీ మూలపడి పోయినయి. అది ఎలా వుద్ధరించటమో నారాయణ రావుకి పాలుపోలేదు. అప్పచేద్దామా! చచ్చే లోపుగా తీర్చలేమేమో! చేయకపోతామా తల పెట్టిన కార్యం సగంలోనే ఆగిపోయేటట్లుగావుంది. ఏం చేయటం! నారాయణరావు పరిపరి విధాలుగా ఆలోచించాడు. పీర్ల పంజాయావ, కొడుకు పుట్టంగానే తగ్గిపోయింది. ఆస్తిపోయింది. వున్న యిల్లు అమ్ముడుపోయింది. ఇంకా అప్పులు తీరలేదు. అడిగేవాళ్ళు అడుగుతూనే వున్నారు. వీధిలోకి వెడితే, తలెత్తుకునే ఆస్కారం లేకుండావుంది. ఎంత కాలమని, అన్నగార్ని అడిగి తీసుకోనూ! నారాయణరావుకి మనస్సు వేదనగావుంది. జీవితం అంటే భయం వేసింది. పోయిన మర్యాద, గౌరవం, సభ్యత, ఆస్తి, యిల్లూ మళ్ళీ వస్తయ్యా! రావని తెలిసివున్నప్పటికీ, మనో వ్యాకులత ఎక్కువైంది. యిదివరకటి మాదిరిగా తిరగటానికి, ధైర్యం చాలటం లేదు. ఎవరితోనైనా మాట్లాడ్డానికి నోరు రావటం లేదు. కన్నెత్తిచూస్తే, కాండ్రించి ముఖాన వుమ్మేస్తారేమోనని, భీతిచెందేవాడు. అప్పటికీ, యింత అనుకొంటున్నా, "వీరభద్రంవల్లనే నేనీగతి కొచ్చానని". మాటవరుసకన్నా లోలోన అనుకోవటంలేదు. చేసిన పాపం శారదకి చెప్పటానికి, నారాయణరావెంత భయపడుతున్నాడో, శారద కూడా అంతే భయపడుతోంది. రోజులు గడుస్తున్నాయి. ఉన్నట్టుండి ఒకనాటి సాయంకాలం నారాయణరావుకి ఒళ్ళు వెచ్చబడింది. ఆ రాత్రి అతను లంఖణం చేశాడు. కాసిని కాఫీ నీళ్ళు త్రాగి, చంటివాణ్ణి ముద్దెట్టుకొని, పడుకున్నాడు .. తెల్లవారింది.

నారాయణరావుకి జ్వరం బాగా వచ్చింది. చలి, వున్న దుప్పట్లన్నీ కప్పినా వెచ్చదనం పుట్టడంలేదు. అతని కాళ్ళూ చేతులూ - పదుమూ గుంజుకుపోతున్నాయి. శారద నానా అవస్థలు పడుతూ సేవచేయటం మొదలెట్టింది. తన మట్టుకు వండుకున్న అన్నం తిన బుద్ధికాక, ఆ చంటివాణ్ణి ఎత్తుకొని, భర్త మంచం వద్ద, దిగాలుపడి కూర్చుంది. డాక్టరొచ్చి - తరచుగా వచ్చే అతను - జ్వరమెంతవుందో చూసి మందిచ్చి వెళ్ళిపోయాడు. కాఫీ మాత్రం త్రాగాలనుకున్నప్పుడల్లా శారద యిస్తోంది.

ఒక వారం గడిచింది. నారాయణరావుకి జ్వరం తగ్గటంలేదు. ఆ నాటి కన్నాడు ఎక్కువవుతోంది. డాక్టరు మందు యిచ్చి వెడుతూనే వున్నాడు. యీ వారం రోజుల్లో వీరభద్రం రెండుమూడుసార్లు వచ్చి చూసివెళ్ళాడు. . జగన్నాధానికి కబురు పంపారు.. అతనువచ్చి, ధైర్యంచెప్పి వెళ్ళాడు ..

ఇలా .. వారాలు గడిచినయి. పక్షాలు గడిచినయి, నెల దాటింది. నారాయణరావుకి ఏం జ్వరమో తేలలేదు. వస్తే నూటరెండో, నూటమూడో వచ్చేది. విపరీతంగా చలివేసేది. వణుకు పుట్టేది. శరీరమంతా భరించలేనంతగా నొప్పులు వుండేవి .. చివరకు ఒకనాడు డాక్టరు, నారాయణరావుకి "అది జ్వరం కాదూ! మనోవ్యాధి" అని తేల్చి చెప్పాడు.. శారదకు అప్పులవాళ్ళు గుర్తొచ్చారు. భయంవేసింది. సరిగ్గా ఆ సమయంలో వీరభద్రం వచ్చాడు. శారద, మాట్లాడక తప్పలేదు. డాక్టరన్న మాటలు చెప్పింది. నిశ్శబ్దంగా విన్నాడు. తరువాత, మెల్లిగా, నారాయణరావు దగ్గరగా కూర్చొని, ఓదారుస్తూ.

"నువ్వేటూ బాధపడకు .. జరిగిందేదో జరిగింది. వూరుకో! శారద కంగారుపడుతుంది." ఏమిటో చెబుతున్నాడు నారాయణరావు జ్ఞానహీనుడిలా వింటున్నాడు. శూన్య దృష్టితో భార్యనీ, కుమారుణ్ణీ చూశాడు .. మెల్లిగా చేయివూపుతూ, కొడుకుని దగ్గరకు తీసుకొన్నాడు. శారదకూడా ఎదురుగా వచ్చి నిలబడింది. నారాయణరావు బాధగా, చూస్తూ.

(సశేషము)

# రాజకుమార్

ఫ్రెంచి మూలం :
ఆంటోని డిసెయింట్-ఎక్సుపెరీ

ఆంధ్రానుసరణ :
డాక్టర్ వి. ఎస్. శర్మ



## అబ్బాయి లోకపు దివ్యదృశ్యాలు!

(గతసంచిక తరువాయి)

"అంటే ఈ గ్రహమండలాలన్నీ మీ ఆజ్ఞని శిరసావహిస్తాయి అన్న మాటేనా?' అని అబ్బాయి ఎదురుప్రశ్న వేశాడు.

"ఆ! అన్నీ నేను చెప్పినట్లు విని తీరాలి, అలా చేయక పోయ్యారా! ... ఏశిక్షవిధిస్తానో వాటికి బాగా తెలును..." అని చుట్టూవున్న గ్రహమండలాలకేసి ఠీవితోచూస్తూ అన్నాడు రాజు. ...

అంత అధికారం తనకూ వుంటేనా తన కోరికలన్నిటినీ యథాతథంగా నెర వేర్చుకో వచ్చుగా! అని తనలో అనుకుంటూ అబ్బాయి రాజుకేసి ఆశ్చర్యంతో చూడసాగాడు.

అబ్బాయిని వుక్కిరిబిక్కిరి చేస్తూ వున్న కోరికల్లో అతి ముఖ్యమైంది పదేపదే సూర్యాస్తమయాన్ని చూడాలని! ఆ కోరిక ఇంతవరకూ తను అనుకున్నట్లు కొనసాగింది కాదు. ఇప్పుడు రాజు వున్నాడు. ఆయనకు అన్ని లోకాల మీదా అధికారం వుందట. దాంతోనే తన కోరికనుకూడా నెరవేర్చు కొనగలిగాడా! ...

"సూర్యోదయాన్ని చూడాలని ఆతృత పడుతున్నాను. మీ అధికారంతో ... సూర్యగ్రహం మీ అడుపాజ్ఞల్లో వుండే వుంటుందిగా! సర్వావస్థల్లో అస్తమిస్తూనే వుండమని..."అని అబ్బాయి తన కోరికని నివేదించసాగాడు.

"నువ్వు కోరే కోరికలు బాగానే వున్నాయి...కాని నా సేనాధిపతిని' నువ్వు సీతాకోక చిలుకకి మల్లె ఒక పువ్వుమీద నుంచి మరో పువ్వు మీదికి ఎగరా'లని అంటానే అనుకో. అది కాకపోతే 'నువ్వు విషాదాంతమైన నాటకాన్ని చప్పుచప్పున రాయాలి' అని ఆజ్ఞాపిస్తానే అనుకో. ఆ మనిషి నా ఆజ్ఞని శిరసావహించకపోతే తప్పు అతనిదా లేక నాదా? ... "

"అదంతా మీదే?" అని చప్పున అనేశాడు అబ్బాయి.

"అలా దోవలోకి రావాలి. ... రాజు అనేవాడుకూడా తను ఇచ్చే ఆజ్ఞలు సరి అయినవాకావా అని ప్రశాంతంగా ఆలోచించి తరువాత వాటిని ఇయ్యాలి. అప్పుడే వాటికి విలువ అనేది వుంటుంది."

"మీ రనేదంతా బాగానేవుంది ...

"ఇంతకూ నా కోరిక సంగతి ఏమను కున్నారు ?" అని అబ్బాయి ఆదుర్దాతో ప్రశ్నించాడు.

"సూర్యాస్తమానం ఎప్పుడూ వుండా లనే నువ్వు కోరుకోనేది ? ఇవ్వటానికి ఆజ్ఞ ఇయ్యవచ్చు. కాని అది ఎంతవరకు సాధ్య మవుతుందా అనే సంగతికూడా ఆలోచించ వద్దూ ముందు ! ..."

"అంటే ! ... సాధ్యంకాదనా మీ రనేది ?"

"కొంచెం ఓపిక పట్టాలి" అంటూ రాజు ఏవో లెఖ్ఖల్ని తీయసాగాడు. ... కొంతసేపటికి అమాంతంగా చేస్తున్నపనిని ఆపేసి "నువ్వు కోరిన కోరికకదూ... సాయం కాలం ఏడుగంటలా నలభైనిమిషాలు అవాలి ! అంతవరకు మనం కొంచెం ఓపికపట్టివున్నామా ... ఆజ్ఞనిస్తాను. సూర్యుడు తూ. చ. తప్పకుండా నెరవేరు స్తాడుకూడా !" అని అబ్బాయికేసి ఆప్యా యంగా చూస్తూ అన్నాడు. రాజు

అంత వరకు ఆగటంఎలా ? రాజు దగ్గర వూరక కూచోటం మూలాన తిరిగి ఆవ లింతలు ప్రారంభమయ్యాయి. అబ్బాయికి ఇంక అక్కడినుంచి చప్పున బయలు దేరటమే సర్వోత్తమ మనుకున్నాడు. రాజుకి అబ్బాయి ఆలోచన అవగాహనమైంది. వాడి వాలకాన్ని తదేకంగా చూస్తూ వుండటం మూలాన. "నువ్వు ఇక్కడేవుండి పో ... అలా వుంటివా నిన్నుఒక మంత్రిగా చేస్తాను" అని ప్రాధేయపడుతూ అన్నాడు.

"అంటే ఏ మంత్రిగా ?"

"న్యాయశాఖా మంత్రిగా !"

"ఆ మంత్రి పదవికి తగినవాళ్లు మీ దగ్గర లేరా మరి ?"

"ఆ గొడవంతా నీ కెందుకువచ్చింది ? ... నేనూ ముసలివాణ్ణి అవుతున్నాను. ఇక్కడ ఆ పదవికి తగినవాళ్లు లేరు ..."

అబ్బాయి నలు ప్రక్కలా కలయ చూస్తూ "ఇక్కడ లేకపోతే ఆ ప్రక్క మండలాల్లో వుంటారుగా ! అక్కడివాళ్లకే .. "అని అనబోతున్నాడు.

అబ్బాయి మాటకి అడ్డువస్తూ "ఆగాలి! కొంచెం ఆగాలి! అక్కడి సంగతులూ నాకూ బాగా తెలుసు. ఈ మంత్రి పదవి సామాన్యమైంది అయితేగా ! ఎక్కువ తెలివితేటలువుండాలి. అలాటివి నీలో కన బడుతూవున్నాయి. అంచేత నువ్వే దీనికి అన్ని విధాలా తగిన వాడివి" అన్నాడు రాజు.

"అమ్మయ్యో! నేనా ఆ పనికి తగిన వాణ్ణి! ఈ క్షణకాలం ఇక్కడ వుండలేక వుక్కిరి బిక్కిరి అయిపోతున్నానే! ఇంక ఆ అధికారం వచ్చాక ..."

"ఆ! అదే! అదే! అధికారం వచ్చాక దానికి తగిన వాతావరణం దానంతటదే వస్తుంది. దాంతో అన్నీ చక్కబడి పోతాయి. ఆ మంత్రి స్థానంనుంచి ఎంతో పని సునాయాసంగా చేయవచ్చు. రాత్రిళ్లు ఈ మండలంలో ఎలకలు తండోపతండంగా దండయాత్ర చేస్తూవుంటాయి వాటినిపట్టి వురిశిక్ష విధించటం నీ బాధ్యత. ఆపనినే చేస్తివా మేమంతా కుశలపడతాం .... అంత కఠిన శిక్షవిధించటానికి ఇష్టంలేక పోతే వాటిని క్షమించవచ్చు. దాన్ని తేల్చటంకూడా సులభమైనపనే" అని రాజు అబ్బాయి క్రొత్తపదవిలో చేయాలసిన తతంగాన్నంతా వివరించటానికి ప్రారంభించాడు.

"అమ్మోయ్మో! అదంతా నాచేత నవుతుందనా మీ నమ్మకం. నాకేంవద్దు ఆ పదవి. దానికొక నమస్కారం. మీకొక నమస్కారం. ఇంక వెళ్లి పోతాను" అంటూ ఆతృతతో రాజుగారి ఆజ్ఞకోసం ఎదురు చూస్తూవున్నాడు. అబ్బాయి.

"ఊహూ! నువ్వు వెళ్ల కూడదు. ఇక్కడేవుండిపోవాలి" అని రాజు సాధికారంగా అన్నాడు.

రాజుగారి ఆజ్ఞ లేకుండానే రాజకుమార్ చప్పున వెళ్లి పోవడానికి చాకచక్యంగల వాడే. కాని రాజును చూశాక, ఆయనతో ఇలా పరిచయం అయ్యాక ఆయన మనస్సుని నొప్పించటానికి ససేమిరా ఇష్టం లేదు అబ్బాయికి.

"మీరంత పట్టుపడుతూవుంటే మీ ఆజ్ఞనికొనసాగించటం అవసరము. నా అవస్థమీరు కళ్ళారచూస్తూనే వున్నారు. అంచేత వెళ్లటానికి ఆజ్ఞ ఇవ్వాలి." అని బుంగమొఖం వేసుకుని ప్రాధేయపడ్డాడు. తనని వుక్కిరిబిక్కిరి చేస్తూవున్న ఆవలింతల్ని శాయశక్తులా ఆపుకుంటూ.

ఎంత ప్రాధేయపడ్డా రాజు అబ్బాయి అవస్థను అర్థంచేసుకుంటేనా! ఇక్కడవుండి పోతే తనకింక మనశ్శాంతి వుండదు. అంచేత తిన్నగా రాజ దర్బారుని వదిలేసి వెళ్లటమే అన్ని విధాలా మంచిదనుకుంటూ కూచున్నచోటినుంచి చటుక్కున లేచి వెలుపలికి వెళ్లబోతున్నాడు.......

అబ్బాయి ఇంత స్వాతంత్ర్యంతో తనని వదిలిపెట్టి వెళ్లిపోతాడని రాజు అనుకోలేదు. తనకు మంత్రులు వున్నారు. తన ఆజ్ఞలని శిరసావహిస్తూవుండే జనంవుంది. కాని వాళ్లంతా ఒక ఎత్తు. అబ్బాయి ఒక ఎత్తు. అబ్బాయి తన దగ్గరకు వచ్చింది కొద్ది నిమిషాలక్రిందే. తన స్వంత బిడ్డకి మల్లెవాడిమీద మమత రేకెత్తి పోతూవుంది. అలాటి పరిస్థితిలో వాడిని అలా వెళ్లనియ్యటంతప్పుగా! ...

రాజు తన సింహాసనంమీదనుంచి దిగి అబ్బాయిని ఆప్యాయంగా పిలుస్తూ తన దగ్గరికి చేరదీశాడు''

మంత్రిగా వుండటానికి ఇష్టంలేకపోతే నిన్ను నారాయబారిగా చేస్తాను. దాని కయినా ఒప్పుకోవాలి ''అనిదీనంగా అడిగాడు. రాయబారి పదవిఅంటే సామాన్యమైందా? మంత్రి పదవికన్నా రెట్టింపు అధికారంతో నిండినపని. రాజుగారి ప్రతినిధిగా అన్ని మండలాలని నిరభ్యంతరంగా తిరిగి రావచ్చు. ఒక్కొక్కసారి రాజు గారి పనినే తను స్వయంగా చూసుకోవాలసి వస్తుంది కూడా!.......

''రాజు అంత వుదార హృదయంగల వాడు. తమ పదవుల్లోని లోతు పాతుల్ని అవగాహనం చేసుకోగల వాళ్లంతా ఇలాటి వాళ్ళే'' అని రాజకుమారుడు అన్నాడు తన జీవితంలోని యీ సంఘటనని నాకు యాథాతథంగా చెప్తూ.

# మృత్యుచ్ఛాయలు

శ్రీ నాయుడు వెంకట సీతారామమూర్తి

—(౦)—

గడియారం యీసుకోమంటూ పదకొండు గంటలుకొట్టి ఊరుకుంది. కారుమేఘాలు కమ్ము కున్న ఆకాశం ఉరుములతో, మెరుపులతో భయాన కంగా ఉంది. ఆ రాత్రి సమయంలో ఆనందభవనం మేడమీద వరండాలో నాలుగు గొంతుకలు ఏవో కబుర్లు చెప్పుకుంటున్నాయి. టేబిల్ మీదున్న లైటు చుట్టుప్రక్కల చీకటిని మ్రింగేస్తూ సన్నగా వెలు తుర్ని ఆ వ్యక్తులమీదకు ప్రసరింప జేస్తోంది.

"ఈ చీకటినిచూస్తే మానవుడికి ఎందుకో అంత భయం?" అంది ఒక గొంతుక.

"చీకట్లో దెయ్యాలుంటాయనీ, అవి మనల్ని పట్టుకుపీడిస్తాయనీ, కలలోకూడా దెయ్యాలు కన్పి స్తాయనీ, పూర్వంనుంచీ మనం ఎన్నో కథలు వింటున్నాం. అదెందుకూ! మా తాతగారు కొంతి దెయ్యాలతో మాట్లాడేవారటకూడానూ" అంది మరో గొంతుక.

"ఆ! గాడిదగుడ్డు! గుండెధైర్యం ఉన్నవాడిని యీ దెయ్యాలేం చేస్తాయి?" అంది మరో బొంగురు గొంతుక గాంభీరంగా.

"ఈ దెయ్యాల గురించి రాంబాబు అభిప్రాయం ఏమిటో?" రాంబాబు వంకచూస్తూ అడిగేడు అందులో ఒక వ్యక్తి.

రాంబాబు ఏమీసమాధానం చెప్పలేదు. నిశ్శ బ్దంగా కూర్చుని ఉన్నాడు. అతని ఆలోచనా తరంగాలు తన గత చరిత్రను ఒక్కసారి స్ఫురణకు తెచ్చేయి. ఆ చరిత్రను ఒక్కసారి నెమరువేసు కుంటూ అట్టే ఉండిపోయాడు. రాంబాబు ఆ చర్చలో పాల్గొనకపోవడం మిగిలిన ముగ్గురునీ నిరు త్సాహపరచింది.

"అసలు దెయ్యాలనేవి ఉన్నాయంటారా?" మళ్ళీ అడిగేడు రాంబాబును ఆ వ్యక్తే.

"ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడం అంత సులువుకాదు. ఉన్నాయనుకునేవాళ్లకు ఉండొచ్చు. లేవనుకునేవాళ్ళకు లేకపోవచ్చు. అది వారి వారి మనస్తత్వాల్నిబట్టి, మానసిక ప్రవృత్తినిబట్టి ఉంటాయి" అన్నాడు రాంబాబు.

"మీ అభిప్రాయాన్నిబట్టి ఉన్నాయంటారా? లేవంటారా?" మళ్ళీ ప్రశ్న.

"నా అభిప్రాయం ఫలానా అని నేనూ నిర్ధ ష్టంగా చెప్పలేను. అప్పుడప్పుడు నేనూ వాటిని గురించే దీర్ఘంగా ఆలోచిస్తూ ఉంటాను. కానీ ఏదో ఒక నిర్ణయానికి రావడానికి అదేమీ అంత తేలికైన సమస్యకాదు. ఆధునిక శాస్త్రజ్ఞులు అవన్నీ మానసిక దౌర్బల్యంవల్ల కేవలం మనం ఊహించుకున్న కల్పిత దృశ్యాలే అంటారు. కానీ మన పురాణాలు, యితిహాసాలు ఆవాదాన్ని ఒప్పు కోవు."

"మరి ఆ రెండింటికీ సమన్వయం?"

"అదే మనం తేల్చుకోలేని సమస్య. చెట్టు ముందా? విత్తు ముందా? అంటే ఎవరు చెప్ప గలరు? యీ సమస్యలాంటిదే నా జీవితంలో ఒక సంఘటన జరిగింది. దాని పరిణామం ఏలా రూపొందుతుందో త్వరలోనే నేను చూడవలసిఉంది" రాంబాబు సమాధానంలోటి స్నేహితులను మరింత ఉత్సాహపరచింది.

"అయితే యింకనేం! మీ అనుభవాల్ని మా చెవులకు వినిపించండి మరి!" అన్నాయి మూడు గొంతుకలూ ముక్తకంఠంతో.

"నా చరిత్ర యిప్పటివరకూ ఎవ్వరితోనూ చెప్ప లేదు. చెప్పవలసిన అవసరంకూడా కలుగలేదు. యిప్పుడు ఆ ప్రసక్తి వచ్చింది కాబట్టి చెప్పవలసి

వచ్చింది" అంటూ రాంబాబు తన చరిత్రను చెప్పడానికి ఉపక్రమించేడు.

"ఇది మూడేళ్ళ క్రిందటిమాట. అప్పుడు నేను విజయవాడలో పనిచేస్తున్నాను. ఆ రోజుల్లో నాకు నర్సయ్యగారనే జమీందారు పరిచయమయ్యేరు. షష్టిపూర్తిచేసుకుని సంవత్సరమే అయిందట. మంచి స్వభావం. వారానికి నాలుగైదు సార్లయినా నన్ను కలుసుకుంటేగానీ వారికి తోచదట. అప్పుడప్పుడు వారు నా రూముకి వస్తూ ఉండడం (అప్పటికి నాకింకా పెళ్ళికాలేదు కాబట్టి 'రూము' అనవలసి వచ్చింది) పిచ్చాపాటీ మాట్లాడుతూ ఉండడం జరుగుతూ ఉండేది. ఒక రోజున నేను వారింటికి వెళ్ళడం తటస్థించింది. అదొక పెద్ద భవనం. ఆధునిక పరికరాలతో ఇల్లంతా అందంగా అలంకరించబడి ఉంది. ఈజీచైర్‌లో కూర్చుని వారితో ఏదో లోకాభిరామాయణం మాట్లాడుతున్నాను. అంతలో ఒక నవయువ్వని కాఫీ తీసుకువచ్చి మా టేబిల్ మీద ఉంచింది. ఆ అమ్మాయి అందం వర్ణనాతీతం. కళ్ళతో చూడాలేకానీ వర్ణించడానికి సాధ్యంకాని అందమది. అందమైన ఆ కళ్ళు ఆకర్షణీయంగా, అమాయకంగా, నా వంక చూసినై. నేనూ ఆమె వంక తీక్ష్ణంగా చూడక తప్పింది కాదు. వయస్సు రెండు పదులుంటాయి. సన్నగా, నాజూగ్గా ఉంటుంది. గుండ్రని ముఖం, ఎర్రటి పెదిమలు జార్జటు సిల్కుచీర కట్టుకుంది. ఒకటి రెండు నిముషాలు నుంచుని వెళ్ళిపోయింది."

"మా అమ్మాయి. సరోజ" అన్నారు నర్సయ్యగారు నేనడగకుండానే నా వంక చూస్తూ.

"అలాగా! నా కెప్పుడూ చెప్పలేదేమండీ?" అన్నాను యింకేమనాలో తోచక.

నర్సయ్యగారి ముఖంలో విషాదచ్ఛాయలు కమ్మేయి. ముఖం వెలవెలబోయింది. అప్పటివరకూ చిరునవ్వుతో మాట్లాడేవారు క్షణంలో అలా మారిపోవడం నాకమితాశ్చర్యాన్ని కలిగించింది.

"దిగులుగా ఉన్నారేమండీ?" అని అడిగేను.

"ఏమిచెప్పను రాంబాబూ! మా సరోజను తలుచుకుంటూంటే గుండె చెరువైపోతోంది. నాకు కావలసినంత డబ్బుంది. గౌరవముంది. ప్రతిష్ఠఉంది. లేనిదల్లా ఒక్క మనశ్శాంతి. నా మనస్సును బాధించే సమస్య 'సరోజ'." అని కళ్ళు తడిచేసుకున్నారు.

"అదేమిటి నర్సయ్యగారూ? చిన్నపిల్లాడిలా! అసలు విషయం ఏమిటో నాతో చెప్పండి;" అన్నాను ఓదారుస్తూ

"మా సరోజకు పదహారవ ఏటనే పెళ్లయింది. ఒక 'లక్ష' కారం కట్నం ఇచ్చి వైభవంగా పెళ్లి చేశాను. కానీ పెళ్లయిన కొద్ది రోజులకే భర్త చనిపోయాడు. 'దాని రాత ఏలారాశి ఉందో! అంతా దైవసంకల్పం' అన్నారు పెద్దలు. యిద్దరి నక్షత్రాలకూ వివాహయోగం సరిగ్గా కుదరలేదన్నారు మరికొందరు. ఒక సంవత్సరం గడిచిన తర్వాత మరో సంబంధాన్ని నిశ్చయించేను. పెళ్లికి అన్ని ఏర్పాట్లూ చేయించేను. కానీ దురదృష్టం మమ్మల్ని విడనాడలేదు. కారు ప్రమాదంలో పెళ్లి కొడుకు మరణించేడన్న వార్త నా చెవుల్లో పడే సరికి స్పృహతప్పి పడిపోయాను. కుప్పలా కూలిపోయింది సరోజ. అప్పటినుంచీ సరోజ అదోలా అయిపోయింది. ఎవ్వరితోనూ మాట్లాడదు. ఒకప్పుడు నవ్వుతుంది. మరొకప్పుడు ఏడుస్తుంది. ఒక్కొక్కప్పుడు కులాసాగానే అందరితో కబుర్లు చెబుతుంది. పెళ్ళి ప్రసక్తి వస్తే, అదోలా అయిపోతుంది. పిచ్చిపట్టలేదుకదా! అన్నారు కొందరు. దెయ్యం పట్టిందేమో అన్నారు మరికొందరు. డాక్టరుకి చూపిస్తే శరీరం ఆరోగ్యంగానే ఉందన్నారు. కానీ సరోజమీద పడిన ప్రచారం అల్లా ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నవాడు యింక జీవితంమీద ఆశపెట్టుకోనక్కరలేదనీ, ఆమెకు యింక వివాహయోగ్యత లేదనీను. ఎన్నో శాంతులు పూజలు వ్రతాలు చేయించేను. కానీ పరిస్థితి

మామూలుగానే ఉంది. నాకు ఉన్నదల్లా ఒక్కటే దిగులు. సరోజకుయింక పెళ్ళయే యోగ్యతలేదా; అందుగురించే యీలా కృంగి కృశించి పోతున్నాను” అంటూ ముగించేరు.

“నేను నిశ్శబ్దంగా వినాను. ఆమెకు నిజంగా దెయ్యం పట్టిందా? పట్టడానికి అసలు దయ్యాలనేవి ఉన్నాయా? ఆమెను తిరిగి వివాహం చేసుకున్న వాడూ చచ్చేతీరాలా? ఏమిటో యీ వింత? చటుక్కున నాకో ఆలోచన తట్టింది. ఆ విధంగా చేస్తే! సరోజను నేనే వివాహం చేసుకుంటే! ఆమె నిజంగా రూపవతి అయినా ఆమె రూపలావణ్యాన్ని చూసి నేను ప్రేమించలేదు. ఆమె ఆస్తి పాస్తుల్ని చూచి భ్రమపడలేదు. నర్సయ్యగారితో ఆ మాటే చెప్పేశాను. ఆయన అత్యంతానంద భరితులయ్యేరు. ఒక శుభముహూర్తాన నాకూ సరోజకు వివాహం జరిగిపోయింది.”

సినిమాలో సస్పెన్సు దృశ్యాలు చూస్తున్నట్టుగా కుర్చీలో కూర్చున్న మూడు శరీరాలూ కదలకుండా మెదలకుండా, నిశ్శబ్దంగా వింటున్నాయి.

“మా చెల్లెలు సరోజ చరిత్ర మంచి రసవంతంగా ఉందే!” అని వ్యాఖ్యానించింది ఒక శరీరం.

“కథ మంచి సస్పెన్సులోకి వచ్చింది. త్వరగా కానీయండి” అంటూ కంగారు పెట్టసాగింది మరో ఘటం.

“నా వివాహ సమయంలో నన్ను కలవర పెట్టిందల్లా ఒక్కటే విషయం. పెళ్లయిన తర్వాత ఒక వేదాంతి వచ్చి ‘యీ అమ్మాయిని పెళ్ళిచేసుకున్న వాడికి గండం ఉంది. ఈ రోజుకు సరిగ్గా మూడు సంవత్సరాల తర్వాత యిదే రోజు అర్ధరాత్రి పన్నెండు గంటలకు ఆమెవల్ల గండం తప్పితే అదృష్టవంతుడే’ అన్నాడు. నాకు కొద్దిగా భయం వేసింది. తరువాత గుండె నిబ్బరం చేసుకున్నాను. సరోజను కాపురానికి తీసుకువచ్చేశాను. ఆ ఊళ్ళోనే, వారి యింట్లోనే ఉండమని మామగారు పట్టుపట్టినా ఉద్యోగం ట్రాన్స్‌ఫర్ అవ్వడంవల్ల యీ ఊరు రావడం తప్పిందుకాదు. నేను ఉద్యోగం చెయ్యకపోయినా సరోజ ఆస్తితో ఏడుతరాల వాళ్లుకూడా జీవించ వచ్చని నాకు తెలియకపోలేదు. కానీ కష్టపడి నేను సంపాదించుకున్న డబ్బుతోనే జీవించాలని నా అభిమతం. కాపురానికి వచ్చినా సరోజ పరిస్థితి రోజురోజుకూ విచిత్రంగా కన్పించింది. నిద్రలో స్పృహలేకుండానే లేచి ఎక్కడికో వెళ్లిపోతుంది. ఒక్కొక్కప్పుడు పలవరింతలు, పొలికేకలు వేస్తుంది. ఒక నాటి రాత్రి ఏమైందనుకున్నారూ! నాదగ్గరగా వచ్చి పీక నులివెయ్యబోతూంది. ఉలిక్కిపడిలేచి విడిపించుకున్నాను కాబట్టి సరిపోయింది. ‘యిదేమిటి సరోజా?’ అని అడిగితే నాకేమీ తెలీదని ఏడ్చింది. యిది జరిగి ఒక సంవత్సరం అయింది. అప్పటినుంచి మరేమి జరక్క పోవడం నా అదృష్టమనే చెప్పాలి. కానీ ఒక్క విషయం చెప్తున్నాను. మీ ముగ్గురి మధ్యా నేనిప్పుడు క్షేమంగా ఉన్నాను. కానీ ...” రాంబాబు పెదిమలు వణికేయి. ముఖం అదోలా మారిపోయింది.

“అదేమిటి రాంబాబూ? ఏమైంది” అన్నారు మిత్రులు.

“ఆ నాడు ఆ వ్యక్తి చెప్పిన ఘడియలు సమీపిస్తున్నాయి. పెళ్లయిన నాటికి మూడు సంవత్సరాలతర్వాత అదే రోజు అర్ధరాత్రి పన్నెండు గంటల సమయం యింకొక్క నాలుగునిముషాల్లో సమీపిస్తోంది”

రాంబాబు గడియారం వంక మరొక్కసారి చూశాడు. పదకొండు యాభై ఆరు నిముషాలు గడియారం ‘టంగ్ టంగ్’మని కొట్టుకున్నప్పుడల్లా తన హృదయాన్ని సుత్తితో ఎవరో బాదుతున్నట్టనిపిస్తోంది. ముగ్గురు మిత్రులూ నిశ్చేష్టులై కూర్చున్నారు. మరో రెండు నిముషాలు-మూడు నిముషాలు గడిచేయి. పదకొండుయాభై తొమ్మిది నిముషాలు. రాంబాబుకు కళ్లు తిరిగి పోయాయి,

ఇంతలో అకస్మాత్తుగా మేడ క్రిందనుంచి "అమ్మో! అబ్బా!" అని చావుకేకలా వినిపించింది. ఆ అరపు రాంబాబుకు అయిదేళ్ళనుంచి పరిచయమైనదే! యాంత్రికంగా లేచి పరిగెత్తుకువెళ్ళబోయాడు. మేడమెట్లు దిగబోతూ ... అంతే! దబదబమని పెద్దశబ్దం అయింది. మిత్రులు ముగ్గురూ లేచి చూసేసరికి రాంబాబు మెట్లక్రిందపడి ఉన్నాడు. అతని ముఖాన్ని మృత్యుచ్ఛాయలు కమ్మేశాయి. ఆ చీకటిలో రాంబాబు కళేబరం నీడలా, మసగ్గా కన్పిస్తోంది.

---

Statement about ownership and other particulars about newspaper GRIHALAKSHMI to be published in the first issue every year after the last day of February.

FORM IV

(See Rule 8)

1. Place of Publication ... M/s Kesari Kuteeram Private Ltd., 15, West Cott Road, Madras-14.
2. Periodicity of its publication ... Monthly.
3. Printer's Name ... Dr. S. Seshagiri Rao, *for* M/s Lodhra Press
   Nationality ... Indian
   Address ... 15, West Cott Road, Royapettah, Madras-14
4. Publisher's Name ... Dr. S. Seshagiri Rao *for* M/s Kesari Kuteeram Private Ltd.
   Nationality ... Indian
   Address ... 15, West Cott Road, Madras-14.
5. Editor's Name ... Sri C. C. Punniah, Ag. Editor,
   Nationality ... Indian
   Address ... 15, West Cott Road, Madras-14.
6. Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital ...
   1. Mrs. K. Sarada Nedungadi
   2. Dr. S. Seshagiri Rao
   3. Dr. T. M. B. Nedungadi
   4. Sri K. Radhakrishnan
   5. Mrs. K. Vasantha

   } 15, West Cott Road, Madras-14.

I, Dr. S. Seshagiri Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd.) S. SESHAGIRI RAO,
*Publisher.*

Dated: 15-3-'59.

(152–వ పేజీ తరువాయి)

# ఉ యం ఉంటే ……

బొడ్డుపల్లి కృష్ణావధాని

ఒక రోజున వస్తాదొకడు వచ్చి కొలువు తీరి యున్న రాజుతో "రాజా! నేను ఎన్నెన్నో అద్భుత కార్యాలు చేయగలను. ఎటువంటి అసాధ్యమైన పనులనైన చేయగలను పర్వతాలను సయితము మోయగలను" అన్నాడు,

"అలాగా! అయితే సమీపముననున్న పర్వతమును మోయగలవా" అని అడిగాడు.

"అదెంతపని! కాని నేను యీ మధ్య జబ్బుపడి లేచాను. ఇంకా పుష్టి సమకూరలేదు. మీరు నెల రోజులు మంచి ఆహారసదుపాయములను సమకూర్చినచో నేనా పర్వతమును అవలీలగా మోయగలను"

రాజు మంత్రిని పిలచి "ఈ వస్తాదుకు నెల రోజులు కావలసిన ఆహారసదుపాయములను ఏర్పాటు చేయండి" అని ఉత్తరువు చేసెను.

నెల రోజులు వస్తాదుకు కోరిన ఆహారవసతులు తృప్తిగా సమకూర్చబడినవి. పీనుగ ఆకారంతో వచ్చిన వస్తాదు ఏనుగలాగ తయారయ్యాడు.

నెల రోజుల తర్వాత ఒకరోజున పర్వతము చెంత రాజు మంత్రులు, సామంతులు, ప్రజలు సమావేశమయి వస్తాదును పిలిపించి పర్వతమును మోయమన్నాడు రాజు.

అక్కడున్నవారంతా పర్వతాన్ని ఆ వస్తాదు ఎలాగ మోస్తాడో చూద్దామని ఆసక్తితో ఎదురు చూస్తున్నారు. వస్తాదు ఒకసారి చుట్టూయున్న వారిని కలయచూచి "ప్రజలారా! మీరంతాకలసి యీ పర్వతాన్ని ఎత్తి నా తలమీద పెట్టండి! నేను మోస్తాను" అన్నాడు.

రాజు నిర్ఘాంతపోయి "వస్తాదూ! నెలరోజుల గడువుకాగానే కొండను మోస్తానంటివికదా! యిదేమిటి?" అన్నాడు.

అందుకా వస్తాదు "ఓ రాజా! కొండను మోసెదనంటినేకాని ఎత్తుదునన లేదుకదా! ఇప్పుడైనా కొండను ఎత్తి నా తలమీద పెడితే తప్పకుండా మోస్తాను" అన్నాడు.

ప్రజలు, మంత్రులు ఆ మాటలువిని కొండ నెత్తగలవారెవ్వరూ లేనప్పుడు అతనిని మోయమనడం పొరబాటని గుర్తించారు.

రాజు వస్తాదు యుక్తికి సత్కరించి పంపేశాడు.

బాలలూ! వస్తాదు యుక్తి ఎంత దొడ్డదో చూచారు కదూ!

# రావుజీ — పైజమా

M. V. కేశవగోపాల్

రావుజీ తాలూకాఫీసులో ఓ గుమాస్తా. ఒకసారి వారి ఆఫీసుకు అధికారి ఒకాయన వస్తాడని తెలిసింది. అధికారి దగ్గరకు వెళ్ళాలంటే మాంచి డ్రస్సుండాలి! అందుకని రావుజీ ఓ వారం రోజులు ముందుగానే దర్జీకి ఓ పైజామాకు, షర్టుకు గుడ్డ ఇచ్చాడు. రేపు అధికారిని రావ్‌జీ చూడబోతాడనగా, ఆదినం మధ్యాహ్నం దర్జీ గుడ్డలు ఇంట్లోఇచ్చి వెళ్ళిపోయాడు. ఆ సమయంలో రావ్‌జీ ఇంట్లోలేడు. సాయంత్రం తిరిగి వచ్చాక పైజమా ఉండవలసిన కొలతకంటె రెండు అంగుళాలు పొడవెక్కువగా ఉండటం గమనించాడు.

భార్య దగ్గరకెళ్ళి, "చూడు? దర్జీ ఈ పైజామాను రెండంగుళాలు పొడవుగా కుట్టాడు. రేపే ఆఫీసర్ని దర్శించుకోవాలి… ఇదేమిటని ఎలా పోవ

టం? కాస్త ఆ రెండు అంగుళాలు తగ్గించేసి కుట్టేద్దూ!" అని అడిగాడు రావుజీ.

"ఇప్పుడు నాకు తొందరపని ఉంది. తర్వాత కుట్టిస్తాను." అంది భార్య... రావుజీ ఉండబట్టలేక, చెల్లెలి దగ్గరికెళ్ళి,

"చూడు చెల్లాయ్! రేపు నేను ఆఫీసరు దగ్గరికెళ్ళాలి? ఆ పెను పనుందట. ఈ పైజామాను నీవైనా రెండు అంగుళాలు తగ్గించి కుట్టివ్వమ్మా" అని అడిగాడు,

"ఇప్పుడు నేను నీళ్లు తేవాలి. తర్వాత కుట్టిస్తాలే" అన్నది చెల్లాయి బిందె చంకన బెట్టుకొంటూ.

ఆఖర్గా కొద్ది కూతుర్ని పిలిచి, "అమ్మాయ్! మీ అమ్మకు, అత్తయ్యకీ పనుందట. ఈ పైజామా పొడవు రెండు అంగుళాలు తగ్గించి కుట్టివ్వు" అన్నాడు రావుజీ.

"నాన్నా నేనిప్పుడు చదువుకోవాలి. రేపు ప్రొద్దున్నే కుట్టిస్తా"నంది కూతురు పుస్తకం తెరుస్తూ.

రావుజీ అప్పటికేమీ అనలేక భోజనం ముగించి నిద్రపోయాడు...

పనంతా అయ్యాక రావుజీ భార్య "అయ్యో! ఆయన చెప్పారు కదూ-పైజామా సరిచేయమని" అని జ్ఞప్తికి తెచ్చుకొని, రెండించీలు చించి కుట్టిపెట్టి వెళ్ళిపోయింది.

ఆ తరువాత రావుజీ చెల్లాయివచ్చి "అన్నయ్య పైజామాను కుట్టిస్తాను అన్నాను కదా!" అని రెండించీలు తగ్గించి కుట్టిపెట్టింది. ప్రొద్దున్నే కూతురు కూడా నాన్నగారి పైజామాను కుట్టి, సరిచేసి పెట్టింది

ఇక ప్రొద్దున్నే రావుజీ కాల కృత్యాలన్నీ ముగించుకొని, 9 గంటలకల్లా భోజనం ముగించి డ్రస్సు వేసుకోబోయాడు. పైజమా వేసుకొందామని తీశాడు...తీరాచూస్తే...తాను చెప్పిన కొలతలకంటే నాలుగు ఇంచీలు పొట్టిదైవుంది. రావుజీకి కళ్ళ నీళ్ళ పర్యంతం అయింది, ఆ డ్రస్సు చూసేసరికి ... ఇప్పుడెలా కలవటం ఆఫీసర్ని ఈ పొట్టి పైజామాతో ...ఛ...ఛ ... అనుకొని కడకు షర్టువేసుకొని, పంచకట్టుకొని బయలుదేరాడు ఆఫీసుకి.

చూశారూ! ఒక్క పనిని ఒక్కరికి చెప్పడం బాగు. కానీ, పలువురకు చెప్పడంవల్ల ఎంత రాద్ధాంతమయిందో చూడండి. అలా చెప్పడంవల్ల, డాబుగా వెళదామనుకున్న రావ్‌జీ మామూలు దుస్తుల్లో వెళ్ళవలసి వచ్చింది.





# గృహలక్ష్మి ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | నా చిన్ననాటి ముచ్చటలు : డాక్టరు కే. యన్. కేసరిగారు | రు. 2.00 |
| 2. | కేప (వైద్యగ్రంథము) : ,, | రు. 0.75 |
| 3. | బిల్వ ( ,, ) ,, | రు. 0.75 |
| 4. | అరవింద(నవల) : శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు | రు. 1.00 |
| 5. | శ్రీ జ్ఞానప్రసూనాంబికాశతకము : శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు | రు. 0.37 |
| 6. | ఫిలోమినా తంబుచెట్టి జీవితచరిత్ర (ఆంగ్లము) | రు. 0.75 |

## మా దగ్గర లభించు యితర గ్రంథములు

| | |
|---|---|
| దేవీభాగవతము : శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు | రు. 12.50 |
| సరళా ప్రభాకరము (హిందూగృహము) : శ్రీమతి కా. చంద్రమతిగారు | రు. 1.25 |

**గ్రంథాలయములకు ప్రజాహిత సంస్థలకు ధరలు తగ్గించబడును**

## 'గృహలక్ష్మి'

## స్త్రీల మాసపత్రిక

28 సంవత్సరములనుండి మహిళాభ్యుదయానికి, అచంచలమైన కృషిచేయుచున్న స్త్రీల సచిత్రమాసపత్రిక, త్రివర్ణ చిత్రాలతోటి, విజ్ఞాన వికాసాలను పెంపొందించే వ్యాసాల తోటి, యింకా నాటికలు, కథలు, బాలవినోదంతోటి ప్రతినెల 15-వ తేది వెలువడుచున్నది. విడిప్రతి 40 న. పైసలు

**హిగిన్ బాదమ్స్ స్టాల్సులో దొరకును**

ఏజంట్లులేని ప్రదేశములలో ఏజంట్లు కావలెను

అడ్వర్టైజ్‌మెంటు కాన్వాస్ చేయువారికి మంచి కమీషను సదుపాయములు లభించును

గృహలక్ష్మి కార్యాలయము

రాయపేట, మద్రాసు-14.

# కామాయని

మూలం :
శ్రీ జయశంకరప్రసాదు

అనుసరణ :
శ్రీ కొంపెల్ల సోమేశ్వరశర్మ, బి. ఏ.

(గతసంచిక తరువాయి)

చిరవిషాద విలీన మనమున
దుర్వ్యథామయ తిమిరదనమున
ఉషాసదృశజ్యోతి రేఖను
కుసుమ వికసిత ప్రభాతమ్మను ...

(జీవితమున నాల్గువైపులనుండియు సంఘర్షణ బయలుదేరినపుడు నేను హృదయమున నొక మధుర వాణినౌదును - నా లోని చేతన, యశాంతితో వ్యాకులమంది విశ్రాంతిని వాంఛించునప్పుడు, మనూ, నేను శీతల మలయపవనమునైన యను గాఢధ్వాంతముచే నావరింపబడినపుడు నేనుషఃకాలీన కిరణమునై, కుసుమములను వికసింపజేయు ప్రభాతమునై యరుదెంతును.)

ఈ గానముతో మనునియందు జీవనచంచలనమైనది. తూర్పున ప్రభాతమైనది. మనువు నేత్రములను తెరచినాడు. శ్రద్ధ చేయూతనిచ్చి యతని కూర్చొన జేసినది. అతడు గద్గద స్వరముతో "శ్రద్ధా, నీవు వచ్చితివా? మంచిది. నన్నెటకైన దూరమునకు కొనిపొమ్ము. ఈ భయంకర నిశిదాంధకారమున మరల నిన్ను పోగొట్టుకొన్నచో నా గతి ఏమి?" అనుచుండగా, నామె శిరమును నిమురుచు, కండ్లలో విశ్వాసము విద్యమానముకాగా "నీవు నా వాడవైతివి, ఇక వ్యర్థభయమేల?" అని వ్యక్త మొనర్చుచున్నట్లొక్క మధుర వీక్షణము గావించెను. పూర్వస్మృతి కల్గినతోడనే మనువు కొంత యుద్వేగముతో నేచతీర్చికొని, "శ్రద్ధా, నన్నెచటికైన దూరమునకు కొనిపొమ్ము. ఈ విశాలాకాశము క్రింద, నెచటనైన నుందును. కాని ఇచట మాత్రముండజాలను" అనెను. కొంతశక్తి చేకూరిన పిదప యట్లే చేయవచ్చునని శ్రద్ధ సమాధాన మొసగెను. మనువు శ్రద్ధను కొనియాడుచు నిట్లు ప్రశంసించెను.

"శ్రద్ధా, జలప్లావన సమయమున నేను చింతాకులుడనై, ఆనందశూన్యుడనైయున్న సమయాన నీ మంగళ మధురహాసములతో నా హృదికి వికాస మొనగూర్చితివి. నా హృదయ మొక ముత్తెపుచిప్ప. నీవొక స్వాతిబిందువై యందు ముత్యము నుత్పత్తి జేసితివి. నా హృదయ కుసుమమున మధుర మకరందమువైతివి. నా శిథిల శిశిర జీవనమునకు వసంతమువైతివి. నిన్నొక క్షణికమాదక ద్రవ్యముగ భావించి, నేటివరకు పొరబడితివి. కాని స్వామినీ, నీవు శాశ్వతానందమవు. నా ప్రళయమున కాశ్రయ మొసగిన యుదార శీలవు! కాని నీచుడనైన నేను శుభదమైన నీ కృప నర్థము చేసికొనలేకపోతిని. నేడు కూడ నా స్తవముగ నేవి సుఖములో, ఏవి దుఃఖములో నెరుగకున్నాను! దానమున కయోగ్యమైన క్షుద పాత్రమును నేను! అపరాధిని! శ్రద్ధా నన్ను వర్జింపుము" పెనుగాలి వానవలె మను వొనర్చుచున్న ప్రసంగము పూర్తియగుసరికి రవి యస్తమించెను. ఇడ చిన్నపోయిన మనస్సుతో 'కుమారుని' (శ్రద్ధా పుత్రుని) చెంతనిడికొని పరుండెను. నాటిరాత్రి యంతయు శ్రద్ధ దుఃఖియయ్యెను. తనకంతరంగమిట్లు ప్రబోధమొనర్చెను. "జీవన మొక క్లిష్ట సమస్య మనూ, ఇచటినుండి తత్క్షణమే పారిపొమ్ము. కలుషితమైన నీ పాపిష్టి ముఖమును, స్వచ్ఛప్రభాత కిరణ సదృశ్యమైన శ్రద్ధకెట్లు చూపగలవు. మిగిలిన వారందరు నీకు శత్రువులు కావున అన్ని యాలోచనలను స్వస్తిచెప్పి త్వరగా తరలిపొమ్ము" ఆ ప్రబోధమున కనుగుణముగ అర్ధరాత్రి సమయాన, అందరిని నిదురపోనిచ్చి మనువు పారిపోయెను. తెల్లవారినతోడనే, ఇడా, శ్రద్ధ కుమారుడు చూచి యాతడదృశ్యుడౌట నెరిగిరి.

## దర్శనము

రాజప్రసాదమును, ఇడను, శ్రద్ధ తన కుమారుడు అగు 'మానవు'ని చెంత నిడికొని మనువును వెదకుటకై బయలు వెడలెను. ఆమె యటు సాగిపోవుచుండగనే రాత్రియై నలుమూలలను చీకటి యలముకొనినది. ఆకసమున చుక్కలు మినుకు మినుకుమనుచున్నవి. "అమ్మా, ఎంతదూర మీ ప్రయాణము? ఎచ్చటికి? సూర్యుడు చాలాసేపై దస్తగంతుడైనాడు. నడు. మనమింటికిపోదము." అని కుమారుడు శ్రద్ధను సంబోధించెను. "నాయనా, ఈ విశాల ప్రపంచమంతయు నా యిల్లే! ఇందలి ద్వారములు సదా, సర్వులకొరకు తెరువబడియే యుండును." అనుచుండగనే ఇడ కూడవచ్చి వారితో కలసెను.

ఇడ:- మాతా, నీవేల నాపై ననురాగ విహీనవై, విరక్తవై వెడలిపోవుచుంటివి? నీ స్నేహామృత వర్షములయా నేకరములతో నన్నేల యానందపరుపవు? తల్లీ నన్ను క్షమింపుము, కరుణింపుము.

శ్రద్ధ:- కుమారీ, నేను నీపై ననురాగవిహీన నెట్లగుదును? నన్ను వీడి నిరాధారుడై తిరుగాడుచున్న సమయమున మనువున కాశ్రయ మొసగి కాపాడిన యుదార మూర్తివి. బిడ్డా, నా హృదయమును తప్ప నీకు మరి నేనేమీయగలను? ... బిడ్డా, నేనొకపుడు దుఃఖింతును, మరియొకపు డానందింతును. నేను దేని ననుభవింతునో దానినే నీకిత్తును. అమ్మా, నేను దుఃఖమును సౌఖ్యములుగా పరివర్తన మొనర్చుకొని యానందింతును. ప్రేమ భరితమైన మధురపదార్థముల మిశ్రమమును నేను. ఏదో చిరవిస్మృతి హేతువున నిటు తిరుగాడుచున్నాను ... ఇడా, ప్రభాపూర్ణమైన నీ ముఖమునుచూచి మను వొకసారి తన సర్వస్వమును మరచినాడు. ఇడా; నారి యందు మాయాబలమున్నది! మమతాబలమున్నది. నారి స్వయముగా నొక శక్తివంతమైన శీతలఛాయ! ఆ నారీబలమువలననే లోకము ధన్యమగుచుండగా, నారివైన నిన్ను క్షమింపదలచుట సాహసకార్యము. నేను నేడు నిన్ను క్షమాభిక్ష వేడుకొనుచున్నాను.



## సుజనాపిక్చర్స్‌వారి 'సతీతులసి'

సుజనావారి 'సతీతులసి' తెలుగు చిత్రమును యీ నెల 4 వ తేదిన పత్రికాప్రతినిధులకు విజయా స్టూడియోస్‌లో ప్రదర్శించారు. ఇందులో శ్రీమతి యస్. వరలక్ష్మి, కృష్ణకుమారి, గుమ్మడి, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి మొదలగువారు నటించారు.

కథ చాలవరకు సాఫీగానడిచి పాటలు షుమారుగానున్నవి. ఇందలి మనోజ్ఞమైన సంగీతము యీ చిత్రమునకు జీవము.

తులసి-బృందగా శ్రీ యస్. వరలక్ష్మి బాగా రాణించింది.

ఇందలి సన్నివేశాలు, సందర్భాలు నాటకధోరణిలో నడిచినవి. కృష్ణకుమారి మోహినిగా చక్కగా నటించినది.

సాంకేతికంగా చిత్రము ఉత్తమస్థాయినందుకున్నది. ఈ చిత్రమును డైరెక్టు చేసిన శ్రీ వి. మధుసూదనరావు, నిర్మాతలు శ్రీ పి. శ్రీరామమూర్తి, సి. హెచ్. కుటుంబరావుగారలు ముందుముందు తీయనున్న పౌరాణికచిత్రములను యింకను ఉత్తమంగా రూపొందించగలరని ఆశిద్దాం.

— పున్నయ్య

♦ ♦ ♦

ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారు శ్రీ తాతినేని సూర్యప్రకాశరావు దర్శకత్వాన నిర్మించిన 'ఇల్లరికం' చిత్రము విడుదలకు సిద్ధముగానున్నది. ఈ చిత్రంలో శ్రీ ఎ. నాగేశ్వరరావు, కుమారి జమున, సి. యస్. ఆర్, రేలంగి, గిరిజ మొదలగువారు నటించారు.

♦ ♦ ♦

శ్రీ విఠలాచార్య నిర్మిస్తున్న 'జయవిజయులు' చిత్రంలో శ్రీ ఎ. వి. సుబ్బారావు, కాంతారావు, మిక్కిలినేని, కృష్ణకుమారి మున్నగువారు నటిస్తున్నారు.

♦ ♦ ♦

ప్రకాష్ ప్రొడక్షన్స్‌వారి 'రేణుకాదేవి మహాత్మ్యం' చిత్రము నిర్మించబడుతున్నది. శ్రీమతి జి. వరలక్ష్మి, సూర్యకళ, గుమ్మడి, రమణారెడ్డి, మిక్కిలినేని మున్నగువారు నటిస్తున్నారు.

♦ ♦ ♦

'మా యింటి మహాలక్ష్మి' చిత్రము త్వరలో విడుదల కాబోతున్నది. ఇది హైదరాబాద్‌లోని సారథి స్టూడియోస్‌లో నిర్మించబడినది. నటీనటులు కుమారి జమున, సూర్యకళ, హరనాథ్, రమణారెడ్డి మున్నగువారు. దర్శకుడు శ్రీ రామినీడు. నిర్మాత శ్రీ గంగాధరరావు.

♦ ♦ ♦

శ్రీ పి. పుల్లయ్యగారి దర్శకత్వంలో శ్రీమతి అంజలీదేవి, రాజసులోచన, శ్రీ నాగేశ్వరరావు, యస్. వి. రంగారావు, గుమ్మడి, ముక్కామల మున్నగు నటీనటులతో నిర్మించబడిన 'జయభేరి' విడుదలకు సిద్ధముగా నున్నది.

♦ ♦ ♦

సుప్రసిద్ధ హిందీనటులు పృథ్వీరాజ్, సాహు మోడక్, దుర్గాఖోటే నటించిన 'మహారథికర్ణ' చిత్రమును తెలుగులోకి, తమిళంలోకి డబ్ చేస్తున్నారు. కథారచన శ్రీ తాండ్ర సుబ్రహ్మణ్యం, పాటలు, పద్యాలు, గేయాలు, జాషువా, కరుణశ్రీ, అయ్యగారి, వేమూరి. సంగీతము బాబురావు.

# సంపాదకీయములు

## భారీపరిశ్రమల ఆవశ్యకత

ప్రజల దారిద్ర్యనిర్మూలనకు భారీపరిశ్రమలు అవసరమనే వాదం గాంధీవాదమునకు వ్యతిరేకమయినా భారీపరిశ్రమల విస్తరణవలన, గృహపరిశ్రమలు, లఘుపరిశ్రమలు మాత్రం నశించకూడదు. భారీపరిశ్రమల ఉత్పత్తులు యితర దేశాలతో వర్తకవ్యాపారముల ద్వారా సిరిసంపదల నార్జించుటకు, లఘుపరిశ్రమలు ప్రజావసరాలను చాలినమేరకు తీర్చలేనప్పుడు అత్యంతావశ్యకము. లఘుపరిశ్రమలు ప్రజల అవసరాలను తీర్చకలిగే ఉత్పత్తులు సయితము భారీపరిశ్రమలకు ఒప్పగించబడినచో అదివాంఛనీయము కాదు. లఘుపరిశ్రమల మూలముగా అనేకులకు పనిపాట లమరుచున్నవి. లఘుపరిశ్రమల పతనమువలన నిరుద్యోగులయిన వారి కందరికి భారీ పరిశ్రమలు జీవనముకల్పించలేవు. కాబట్టి లఘు - గృహపరిశ్రమలు భారీపరిశ్రమలు రెండూవర్ధిల్లుతూ, భారీపరిశ్రమలనుండి లఘుపరిశ్రమలకు ఎప్పటికప్పుడు రక్షణసమకూరుతుంటే జాతీయసౌభాగ్యము యథేచ్ఛగా పెంపుకాగలదు.

## అవిద్య - అనారోగ్య నిర్మూలన

అవిద్య, అనారోగ్య నిర్మూలనకు మున్సిపాలిటీలు కృషిచేయాలని శ్రీకాకుళంలో ఆంధ్ర విద్యామంత్రి శ్రీ పట్టాభిరామారావుగారు ప్రబోధించారు.

మున్సిపాలిటీలయినా, పంచాయతీలయినా రాజకీయ పార్టీతత్వాలకు దూరమయి పట్టణములు పల్లెలు అభివృద్ధికావాలనే ఉద్దేశంతో నిర్వహణసాగించితే ఫలితములు మెరుగుగానుంటవి.

ముఖ్యంగా ఆరోగ్యాభివృద్ధికి, విద్యావ్యాప్తికి స్థానిక స్వపరిపాలనా సంస్థలు ఆసక్తిచూపవలసిన ఆవశ్యకత ఎంతైనాకలదు.

---

ఈ నెల 1-వ తేదిన మదరాసు భారతీయ నాటక కళామండలివారు 'చంద్రగుప్త' నాటకమును నెల్లూరు టౌను హాలులో ప్రదర్శించి ప్రేక్షకుల మన్ననలకు పాత్రులైరి. చాణక్యుడుగా శ్రీ యమ్. ఆర్. తిలక్, కాత్యాయనుడుగా శ్రీ వంగర వెంకటసుబ్బయ్య, మురగా శ్రీమతి కళ్యాణి (తెనాలి), హెలెన్‌గా శ్రీమతి యం. ఆర్. తిలకం ప్రశంసనీయంగా నటించారు.

మద్రాసులో కేసరి ఎడ్యుకేషన్ సొసైటీ సహాయార్థం చెన్నపురి ఆంధ్ర విజ్ఞానసమితి (రిజిస్టర్డు) వారు 'శ్రీకృష్ణ రాయబారము' నాటకమును యీ నెల 14-వ తేదిన మాజీ బొంబాయి గవర్నర్ సర్. యస్. వి. రామమూర్తిగారు I. C. S. (రిటైర్డు) సమక్షమున త్యాగరాయనగరు వాణీ మహలునందు ప్రదర్శించిరి.

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
**Ag. Editor : C. C. Punniah.**




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు 4-50. న.పై. అర్ధసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయ మూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతేయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లై కార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

---

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.